శ్రీరస్తు. 124

శ్రీమదుమామహేశ్వర సేవకాగ్రేసర

శ్రీనన్దికేశ్వర ప్రోక్తమయిన

# అభినయదర్పణము.

ఇది భరతశాస్త్రాభిలాషులగు నిఖిలరసికులకును

ప్రియంబుగా

మహారాజరాజశ్రీ- విడవలపాటి- సుబ్బరామయ్యసెట్టిగారి

ప్రేరణమున గ్రంథాంతరముల యందలి

బహువిషయములను జేర్చి

తెనుఁగు తాత్పర్యములతోఁడ

భరతవిద్యాపాదన ప్రవీణులగు, శ్రీమాన్,

నీడామంగలం- తిరువేంకటాచార్యులవారికొమారుడగు

రాజగోపాలాచార్యులవారిచే

మూడవమారు ముద్రింపఁబడియెను.

MADRAS:

PRINTED AT THE SASTRA SANJEEVINI PRESS.



*1905.*

*Registered Copy-right.*

శృంగారరసాధి
...దములను ఆయా
హస్తజ్ఞానమును, ఆ
వ్యాపారములు అ
ములందువిరక్తియు,

శ్రీ సంతానరామ పరబ్రహ్మణేనమః.



# పీఠిక.

శ్రీమత్సకలభువనకర్తయైన శ్రియఃపతికిం బ్రియతమంబై నిఖిలరసిక జనాహ్లాదభాజనంబై సర్వలోకవ్యాపకంబై విలసిల్లెడి భరతశాస్త్రము, శ్లో॥ శంభుర్గౌరీతథా బ్రహ్మమాధవో నందికేశ్వరః। దత్తిలః కోహళశ్చైవయాజ్ఞవల్క్యశ్చ నారదః॥ హనూమాన్విఘ్నరాజశ్చ షణ్ముఖోథ బృహస్పతిః। అర్జునో రావణశ్చైవ కన్యాబాణసుతాతథా॥ ఏతేభరతకర్తారో భువనేషు ప్రకీర్తితాః॥ అనగా, శివుడు, పార్వతి, బ్రహ్మ, విష్ణువు, నందికేశ్వరుడు, దత్తిలుడు-కోహళుడు, యాజ్ఞవల్క్యుడు, నారదుడు, ఆంజనేయుడు, విఘ్నేశ్వరుడు, సుబ్రహ్మణ్యుడు, బృహస్పతి, అర్జునుడు, రావణుడు, ఉషాకన్యక అనువారు భరతశాస్త్రకర్తలు అని లోకములయందు కొనియాడబడుచున్నారు. అనునీయర్థముగల ప్రమాణశ్లోకములచేత వన్నెకెక్కియున్నది, అట్లుండియు ప్రకృతమునందు మనవారందరును అభినయవిద్యను సాధారణవిద్యలలో నొకటిగా దలచియాదరింపకపోవుటయే గాక, అది కేవల పామరరంజకవిద్యయనియు, శిష్టులకు పరిగ్రహణీయము కాదనియు, నాట్యప్రవర్తకులకే యభ్యసనీయమనియు నుల్లంఘించియున్నారనుట యెల్లవారికిని తెల్లమే కదా? మోక్షసాధకమగు యోగశాస్త్రమును బోలిన యీశాస్త్రము ఇట్టిదశకు వచ్చుటకు నాయికానాయకవ్యాపారములను తదంగములయిన యితరవిషయములను జూపి ధర్మమునందు ప్రవృత్తిగలుగ జేయుటయే గాక గూఢార్థప్రదర్శకమునై, ఆంగికాభినయము వలన రసికులగు నభిజ్ఞులకు నానందప్రదమై యట్టి రసికాగ్రగణ్యులచే నాయభినయవిద్యా ప్రవీణులు సన్మానింపబడు విషయము కేవలనటీప్రేష్యముగా నెన్నబడుటయు, జనుల మనసులందు తోచు విషయములను అంగచలనాదులచే దెలిసికొనుటవలన కామవికారము కలుగుననుభ్రాంతియును కారణములగుచున్నవి. అట్లుగాక సూక్ష్మదృష్టిచే చక్కగా విచారించు నెడల ఈశాస్త్రము శృంగారరసాధిష్ఠాన దేవతయు లోకజనకుడునగు శ్రీకృష్ణదేవుని లీలావినోదములను ఆయా రసానుభవములతోడ నూహించి తెలిసికొనుటవలన బ్రహ్మజ్ఞానమును, ఆ జ్ఞానమువలన చూడబడునవి యన్నియు అస్థిరములయిన వ్యాపారములు అను తాత్పర్యమును, ఆతాత్పర్యముచేత అట్టివ్యాపారములందు విరక్తియు,

శాంతిదాంత్యాదివిశిష్టగుణములునుజనింపగానిత్యసుఖప్రదమయినబ్రహ్మా
నందమునుబొందించుననువిషయము తేటపడునుకనుకను,నాయినానాయ
కవ్యాపారములుజ్ఞానపాదార్థమునందుగురుశిష్యులయొక్క-సేవ్యసేవ
కభావబోధకములేగానియితరములుకావుఅనిబ్రహ్మాదులచేత చెప్పబడి
యున్నదికనుకను,ధర్మార్థకామమోక్షములనెడిచతుర్విధపురుషార్థ
ములకునుసాధకమును, సర్వోత్కృష్టమును దేవతాదికర్తృకమునునైన
యీభరతశాస్త్రముఎల్లవిధములచేతనుమనకుపరిగ్రహణీయమును అ
భ్యసనీయమునగును,అనివిచారించి, కాలానుసారముగాదినదినక్షీణదశ
నొందుచున్న దీనినియథోచితప్రచారమునకు తేదలచి, భరతకళలలో
నొకరగునందికేశ్వరునిచేతజెప్పబడిన యభినయదర్పణముఅనుగ్రంథము
నుతొలుతముద్రింపించిప్రకటించితిమి,అయినను అది యెల్లవారికి తేటతెల్ల
ముగాదెలియకయుండుటంబట్టి మ-రా-శ్రీ,విడవలపాటి-సుబ్బరామయ్య
సెట్టిగారుఅనువైశ్యశిఖామణిప్రేరేపణవలన,పతాకాదిముఖ్యహస్తముల
స్వరూపములను దెలిపెడి చిత్రపుగురుతులనాయాహస్తములలక్షణశ్లోక
ములకుమొదటజేర్చియు, గ్రంథాంతరములందుచెప్పబడిన ఆయాహస్త
ములయుత్పత్తికాలము, ఋషిదేవతాజాతివర్ణములు, మొదలగువాని
గూర్చియు,విశేషసంయుతహస్తములను,ప్రసిద్ధరాజులహస్తములను, పు
ణ్యనదులహస్తములను,అశ్వత్థాదివృక్షహస్తములను,సింహాదిమృగహస్త
ములను,హంసాదిపక్షిహస్తములను,నక్రాదిజలజంతుహస్తములను, శిరో
భేదాద్యనేకవిషయములనుసంగ్రహించియునిట్లుచేరిననన్నూటయెనిమిది
విషయములను తెలుపునట్టి శ్లోకములకు స్త్రీబాలకాదులకుగూడ తేటగా
దెలియునట్లుసులభములైనమాటలతో తెనుగుతాత్పర్యము వ్రాసి మూ
డవమారు పెద్దఅక్షరములతో ముద్రింపించితిమి.

ఇదిగాక అభినయమునందు నవరసములు మొదలగువానిని దెలుపదగిన
భరతరసప్రకరణమనెడిగ్రంథమునునిట్లె తెనుగుతాత్పర్యముతో మాచేత
ముద్రింపబడియున్నది.

ఇట్లు,

శ్రేయోభిలాషి-నీడామంగలం-మాడభూషి-తిరువేంకటాచార్యుల

కొమారుడగు రాజగోపాలాచార్యులు,

విషయసూచిక.




| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౧ | గ్రంథానుపూర్వ్యమ్ | ౧ |
| ౨ | నాట్యలక్షణమ్ | |
| ౩ | నృత్తలక్షణమ్ | |
| ౪ | నృత్యలక్షణమ్ | |
| ౫ | లాస్యతాండవభేదమ్ | |
| ౬ | సభాలక్షణమ్ | ౪ |
| ౭ | సభానాయకలక్షణమ్ | |
| ౮ | మంత్రిలక్షణమ్ | ౫ |
| ౯ | రఙ్గలక్షణమ్ | |
| ౧౦ | పాత్రలక్షణమ్ | ౬ |
| ౧౧ | అపాత్రలక్షణమ్ | ౭ |
| ౧౨ | కిఙ్కిణీలక్షణమ్ | |
| ౧౩ | నటలక్షణమ్ | |
| ౧౪ | పాత్రబహిఃప్రాణాః | ౮ |
| ౧౫ | అంతఃప్రాణాః | |
| ౧౬ | నీచనాట్యలక్షణమ్ | |
| ౧౭ | నీచనాట్యదర్శనఫలమ్ | |
| ౧౮ | నాట్యక్రమమ్ | |
| ౧౯ | అభినయలక్షణమ్ | ౯ |
| ౨౦ | అభినయవ్యుత్పత్తి | |
| ౨౧ | అఙ్గాః | ౧౦ |
| ౨౨ | ప్రత్యఙ్గాః | |
| ౨౩ | ఉపాఙ్గాః | |
| | శిరోభేదాః॥౯॥ | |
| ౨౪ | సమశిరోలక్షణమ్ | ౧౧ |
| ౨౫ | ఉద్వాహితలక్షణమ్ | ౧౨ |
| ౨౬ | అధోముఖలక్షణమ్ | |

| విషయసంఖ్య. | | | పుటసంఖ్య. |
|---|---|---|---|
| ౨౭ | ఆలోలితలక్షణమ్ | | |
| ౨౮ | ధుత | ,, | |
| ౨౯ | కమ్పిత | ,, | ౧౩ |
| ౩౦ | పరావృత్త | ,, | |
| ౩౧ | ఉత్క్షిప్త | ,, | |
| ౩౨ | పరివాహిత | ,, | |
| | గ్రంథాంతరస్థశిరోభేదాః॥౨౪॥ | | |
| ౩౩ | ధుతశిరోలక్షణమ్ | | ౧౪ |
| ౩౪ | విధుత | ,, | |
| ౩౫ | ఆధూత | ,, | ౧౫ |
| ౩౬ | అవధూత | ,, | |
| ౩౭ | కమ్పిత | ,, | |
| ౩౮ | ఆకమ్పిత | ,, | |
| ౩౯ | ఉద్వాహిత | ,, | |
| ౪౦ | పరివాహిత | ,, | ౧౬ |
| ౪౧ | అఞ్చిత | ,, | |
| ౪౨ | నిహాఞ్చిత | ,, | |
| ౪౩ | పరావృత్త | ,, | |
| ౪౪ | ఉత్క్షిప్త | ,, | ౧౭ |
| ౪౫ | అధోముఖ | ,, | |
| ౪౬ | లోలిత | ,, | |
| ౪౭ | తిర్యఙ్నతోన్నతలక్షణమ్ | | |
| ౪౮ | స్కంధానత | ,, | |
| ౪౯ | ఆరాత్రిక | ,, | ౧౮ |
| ౫౦ | సమ | ,, | |
| ౫౧ | పార్శ్వాభిముఖలక్షణమ్ | | |
| ౫౨ | సౌమ్య | ,, | |

| విషయసంఖ్యా. | | పుటసంఖ్యా. | విషయసంఖ్యా. | | పుటసంఖ్యా. |
|---|---|---|---|---|---|
| ౫౩ | ఆలోళితలక్షణమ్ | | ౮౧ | దూరలక్షణమ్ | |
| ౫౪ | తిరశ్చీన ,, | | ౮౨ | ఇంగిత ,, | |
| ౫౫ | ప్రకమ్పిత ,, | ౧౯ | ౮౩ | విలోకిత ,, | ౨౫ |
| ౫౬ | సౌన్దర్య ,, | | ౮౪ | వితర్కిత ,, | |
| | దృష్టిభేదాః॥౩౮॥ | | ౮౫ | శఙ్కిత ,, | |
| ౫౮ | సమదృష్టిలక్షణమ్ | | ౮౬ | అభితప్త ,, | |
| ౫౯ | ఆలోకిత ,, | ౨౦ | ౮౭ | అవలోకిత ,, | |
| ౬౦ | సాచీ ,, | | ౮౮ | శూన్య ,, | ౨౬ |
| ౬౧ | ప్రలోకిత ,, | | ౮౯ | హృష్ట ,, | |
| ౬౨ | నిమీలిత ,, | | ౯౦ | ఉగ్ర ,, | |
| ౬౩ | ఉల్లోకిత ,, | | ౯౧ | విభ్రాంత ,, | |
| ౬౪ | అనువృత్త ,, | ౨౧ | ౯౨ | శ్రాంత ,, | |
| ౬౫ | అవలోకిత ,, | | ౯౩ | మీలిత ,, | |
| | గ్రంథాంతరస్థదృష్టిభేదాః॥౪౪॥ | | ౯౪ | సూచన ,, | ౨౭ |
| ౬౬ | సమదృష్టిలక్షణమ్ | | ౯౫ | లజ్జిత ,, | |
| ౬౭ | ప్రలోకిత ,, | ౨౨ | ౯౬ | మలిన ,, | |
| ౬౮ | స్నిగ్ధ ,, | | ౯౭ | త్రస్త ,, | |
| ౬౯ | శృంగార ,, | | ౯౮ | మ్లాన ,, | |
| ౭౦ | ఉల్లోకిత ,, | | ౯౯ | ముకుళ ,, | |
| ౭౧ | అద్భుత ,, | | ౧౦౦ | కుంచిత ,, | ౨౮ |
| ౭౨ | కరుణా ,, | | ౧౦౧ | ఆకాశ ,, | |
| ౭౩ | విస్మయ ,, | ౨౩ | ౧౦౨ | అర్ధముకుళ ,, | |
| ౭౪ | దృప్త ,, | | ౧౦౩ | అనువృత్త ,, | |
| ౭౫ | విషణ్ణ ,, | | ౧౦౪ | విప్లుత ,, | |
| ౭౬ | భయఙ్కర ,, | | ౧౦౫ | జిహ్మ ,, | |
| ౭౭ | సాచీ ,, | ౨౪ | ౧౦౬ | విశోక ,, | |
| ౭౮ | ద్రుత ,, | | ౧౦౭ | మదిర ,, | ౨౯ |
| ౭౯ | వీర ,, | | ౧౦౮ | హృద్య ,, | |
| ౮౦ | రౌద్ర ,, | | ౧౦౯ | లలిత ,, | |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| | గ్రంథాంతరస్థభ్రూభేదాః॥ ౬॥ | |
| ౧౧౦ | సహజభ్రూలక్షణమ్ | |
| ౧౧౧ | పతితభ్రూ ,, | ౩౦ |
| ౧౧౨ | ఉత్క్షిప్త ,, | |
| ౧౧౩ | చతుర ,, | |
| ౧౧౪ | రేచిత ,, | |
| ౧౧౫ | కుఞ్చిత ,, | |
| | గ్రీవాభేదాః॥ ౪॥ | |
| ౧౧౬ | సున్దరీగ్రీవాలక్షణమ్ | ౩౧ |
| ౧౧౭ | తిరశ్చీన ,, | |
| ౧౧౮ | పరివర్తిత ,, | |
| ౧౧౯ | ప్రకమ్పిత ,, | ౩౨ |
| | హస్తప్రాణాః॥౧౨॥ | |
| ౧౨౦ | ప్రసారణప్రాణలక్షణమ్. | |
| ౧౨౧ | కుఞ్చిత ,, | |
| ౧౨౨ | రేచిత ,, | |
| ౧౨౩ | పుఙ్ఖిత ,, | |
| ౧౨౪ | అపవేష్టిత ,, | ౩౩ |
| ౧౨౫ | ప్రేరిత ,, | |
| ౧౨౬ | ఉద్వేష్టిత ,, | |
| ౧౨౭ | వ్యావృత్తి ,, | |
| ౧౨౮ | పరివృత్తి ,, | |
| ౧౨౯ | సఙ్కేత ,, | |
| ౧౩౦ | చిహ్న ,, | |
| ౧౩౧ | పదార్థటీక ,, | ౩౪ |
| | అసంయుతహస్తాః॥ ౩౧॥ | |
| ౧౩౨ | పతాకహస్తలక్షణమ్. | ౩౫ |
| ౧౩౩ | త్రిపతాక ,, | ౩౭ |
| ౧౩౪ | అర్ధపతాక ,, | ౩౯ |
| ౧౩౫ | మయూర ,, | ౪౦ |
| ౧౩౬ | అర్ధచన్ద్ర ,, | |
| ౧౩౭ | అరాళ ,, | ౪౨ |
| ౧౩౮ | శుకతుండ ,, | ౪౩ |
| ౧౩౯ | ముష్టి ,, | ౪౪ |
| ౧౪౦ | శిఖర ,, | ౪౫ |
| ౧౪౧ | కపిత్థ ,, | ౪౬ |
| ౧౪౨ | కటకాముఖ ,, | ౪౭ |
| ౧౪౩ | సూచీ ,, | ౪౮ |
| ౧౪౪ | చన్ద్రకళ ,, | ౫౦ |
| ౧౪౫ | కోశ ,, | |
| ౧౪౬ | సర్పశీర్ష ,, | ౫౧ |
| ౧౪౭ | మృగశీర్ష ,, | ౫౨ |
| ౧౪౮ | సింహాముఖ ,, | ౫౩ |
| ౧౪౯ | లాఙ్గూల ,, | ౫౪ |
| ౧౫౦ | సోలపద్మ ,, | ౫౫ |
| ౧౫౧ | చతుర ,, | ౫౬ |
| ౧౫౨ | భ్రమర ,, | ౫౭ |
| ౧౫౩ | హంసాస్య ,, | ౫౮ |
| ౧౫౪ | హంసపక్ష ,, | ౫౯ |
| ౧౫౫ | సందంశ ,, | ౬౦ |
| ౧౫౬ | ముకుళ ,, | ౬౧ |
| ౧౫౭ | తామ్రచూడ ,, | ౬౨ |
| ౧౫౮ | త్రిశూల ,, | ౬౩ |
| ౧౫౯ | ఊర్ణనాభ ,, | ౬౪ |
| ౧౬౦ | బాణ ,, | |
| ౧౬౧ | అర్ధసూచి ,, | |
| | సంయుతహస్తాః॥౨౪॥ | |
| ౧౬౨ | అంజలిహస్తలక్షణమ్. | ౬౫ |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౧౬౩ కపోత | ,, | ౬౬ |
| ౧౬౪ కర్కట | ,, | ౬౭ |
| ౧౬౫ స్వస్తిక | ,, | |
| ౧౬౬ డోలా | ,, | |
| ౧౬౭ పుష్పపుట | ,, | ౬౮ |
| ౧౬౮ ఉత్సఙ్గ | ,, | ౬౯ |
| ౧౬౯ శివలిఙ్గ | ,, | |
| ౧౭౦ కటకావర్ధన | ,, | |
| ౧౭౧ కర్తరీస్వస్తిక | ,, | ౭౦ |
| ౧౭౨ శకట | ,, | |
| ౧౭౩ శఙ్ఖ | ,, | |
| ౧౭౪ చక్ర | ,, | ౭౧ |
| ౧౭౫ సమ్పుట | ,, | |
| ౧౭౬ పాశ | ,, | |
| ౧౭౭ కీలక | ,, | |
| ౧౭౮ మత్స్య | ,, | |
| ౧౭౯ కూర్మ | ,, | ౭౨ |
| ౧౮౦ వరాహ | ,, | |
| ౧౮౧ గరుడ | ,, | |
| ౧౮౨ నాగబంధ | ,, | |
| ౧౮౩ ఖట్వా | ,, | ౭౩ |
| ౧౮౪ భేరుణ్డ | ,, | |
| ౧౮౫ అవహిత్థ | ,, | |
| గ్రన్థాన్తరస్థసంయుతహస్తాః॥ ౨౬॥ | | |
| ౧౮౬ గజదన్తహస్తలక్షణమ్ | | ౭౪ |
| ౧౮౭ చతురశ్ర | ,, | |
| ౧౮౮ తలముఖ | ,, | |
| ౧౮౯ స్వస్తిక | ,, | ౭౫ |
| ౧౯౦ ఆవిద్ధవక్ర | ,, | |
| ౧౯౧ రేచిత | ,, | |
| ౧౯౨ నితమ్బ | ,, | ౭౬ |
| ౧౯౩ లతా | ,, | |
| ౧౯౪ పక్షవఞ్చిత | ,, | |
| ౧౯౫ పక్షప్రద్యోత | ,, | ౭౭ |
| ౧౯౬ గరుడపక్ష | ,, | |
| ౧౯౭ నిషేధ | ,, | |
| ౧౯౮ మకర | ,, | |
| ౧౯౯ వర్ధమాన | ,, | ౭౮ |
| ౨౦౦ ఉద్వృత్త | ,, | |
| ౨౦౧ విప్రకీర్ణ | ,, | |
| ౨౦౨ అరాళకటకాముఖ | | ౭౯ |
| ౨౦౩ సూచ్యాస్య | ,, | |
| ౨౦౪ అర్ధరేచిత | ,, | |
| ౨౦౫ కేశబంధ | ,, | |
| ౨౦౬ ముష్టిస్వస్తిక | ,, | ౮౦ |
| ౨౦౭ నళినీపద్మకోశ | ,, | |
| ౨౦౮ ఉద్వేష్టితాలపద్మ | | |
| ౨౦౯ ఉల్బణ | ,, | ౮౧ |
| ౨౧౦ లాలిత | ,, | |
| అన్యగ్రం॥ సంయుతహస్తాః॥ ౨౩॥ | | |
| ౨౧౧ విప్రకీర్ణహస్తలక్షణమ్. | | |
| ౨౧౨ గజదంత | ,, | |
| ౨౧౩ తాలముఖ | ,, | ౮౨ |
| ౨౧౪ సూచీవిద్ధ | ,, | |
| ౨౧౫ పల్లవ | ,, | |
| ౨౧౬ నితమ్బ | ,, | ౮౩ |
| ౨౧౭ కేశబంధ | ,, | |
| ౨౧౮ లతా | ,, | |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౨౧౯ ద్విరద | ,, | ౮౪ |
| ౨౨౦ ఉద్వృత్త | ,, | |
| ౨౨౧ సంయమ | ,, | |
| ౨౨౨ ముద్రా | ,, | ౮౫ |
| ౨౨౩ అజముఖ | ,, | |
| ౨౨౪ అర్ధముకుళ | ,, | |
| ౨౨౫ రేచిత | ,, | |
| ౨౨౬ కుశల | ,, | ౮౬ |
| ౨౨౭ పక్షవత | ,, | |
| ౨౨౮ తిలక | ,, | |
| ౨౨౯ ఉత్తానవంచిత | ,, | |
| ౨౩౦ వర్ధమాన | ,, | ౮౭ |
| ౨౩౧ జ్ఞాన | ,, | |
| ౨౩౨ వైష్ణవ | ,, | |
| ౨౩౩ ఖణ్డచతుర | ,, | ౮౮ |
| ౨౩౪ అర్ధచతుర | ,, | |
| ౨౩౫ లీనముద్రా | ,, | |
| బాంధవ్యహస్తాః ౧౧ | | |
| ౨౩౬ దమ్పతీహస్తలక్షణమ్. | | |
| ౨౩౭ మాతృ | ,, | ౮౯ |
| ౨౩౮ పితృ | ,, | |
| ౨౩౯ శ్వశ్రూ | ,, | |
| ౨౪౦ శ్వశుర | ,, | |
| ౨౪౧ భర్తృభ్రాతృ | ,, | |
| ౨౪౨ ననందా | ,, | ౯౦ |
| ౨౪౩ జ్యేష్ఠకనిష్ఠభ్రాతృ | | |
| ౨౪౪ స్నుషా | ,, | |
| ౨౪౫ భర్తృ | ,, | |
| ౨౪౬ సపత్నీ | ,, | |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| దేవతాహస్తాః ౧౬ | | |
| ౨౪౭ బ్రహ్మాహస్తలక్షణమ్ | | ౯౧ |
| ౨౪౮ శమ్భు | ,, | |
| ౨౪౯ విష్ణు | ,, | |
| ౨౫౦ సరస్వతీ | ,, | |
| ౨౫౧ పార్వతీ | ,, | |
| ౨౫౨ లక్ష్మీ | ,, | ౯౨ |
| ౨౫౩ విఘ్నేశ్వర | ,, | |
| ౨౫౪ షణ్ముఖ | ,, | |
| ౨౫౫ మన్మథ | ,, | |
| ౨౫౬ ఇంద్ర | ,, | |
| ౨౫౭ అగ్ని | ,, | |
| ౨౫౮ యమ | ,, | ౯౩ |
| ౨౫౯ నైఋతి | ,, | |
| ౨౬౦ వరుణ | ,, | |
| ౨౬౧ వాయు | ,, | |
| ౨౬౨ కుబేర | ,, | |
| నవగ్రహహస్తాః ౧౪ | | |
| ౨౬౩ సూర్యహస్తలక్షణమ్. | | |
| ౨౬౪ చన్ద్ర | ,, | |
| ౨౬౫ అఙ్గారక | ,, | ౯౪ |
| ౨౬౬ బృహస్పతి | ,, | |
| ౨౬౭ శుక్ర | ,, | |
| ౨౬౮ శనైశ్చర | ,, | |
| ౨౬౯ రాహు | ,, | |
| ౨౭౦ కేతు | ,, | ౯౫ |
| దశావతారహస్తాః ౧౦ | | |
| ౨౭౨ మత్స్యావతారహస్తలక్షణం | | |
| ౨౭౩ కూర్మావతార | ,, | |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౧౬౩ కపోత | ,, | ౬౬ |
| ౧౬౪ కర్కట | ,, | ౬౭ |
| ౧౬౫ స్వస్తిక | ,, | |
| ౧౬౬ డోలా | ,, | |
| ౧౬౭ పుష్పపుట | ,, | ౬౮ |
| ౧౬౮ ఉత్సఙ్గ | ,, | ౬౯ |
| ౧౬౯ శివలిఙ్గ | ,, | |
| ౧౭౦ కటకావర్ధన | ,, | |
| ౧౭౧ కర్తరీస్వస్తిక | ,, | ౭౦ |
| ౧౭౨ శకట | ,, | |
| ౧౭౩ శఙ్ఖ | ,, | |
| ౧౭౪ చక్ర | ,, | ౭౧ |
| ౧౭౫ సమ్పుట | ,, | |
| ౧౭౬ పాశ | ,, | |
| ౧౭౭ కీలక | ,, | |
| ౧౭౮ మత్స్య | ,, | |
| ౧౭౯ కూర్మ | ,, | ౭౨ |
| ౧౮౦ వరాహ | ,, | |
| ౧౮౧ గరుడ | ,, | |
| ౧౮౨ నాగబంధ | ,, | |
| ౧౮౩ ఖట్వా | ,, | ౭౩ |
| ౧౮౪ భేరుణ్డ | ,, | |
| ౧౮౫ అవహిత్థ | ,, | |
| గ్రన్థాన్తరస్థసంయుతాహస్తాః॥ ౨౬॥ | | |
| ౧౮౬ గజదన్తహస్తలక్షణమ్ | | ౭౪ |
| ౧౮౭ చతురశ్ర | ,, | |
| ౧౮౮ తలముఖ | ,, | |
| ౧౮౯ స్వస్తిక | ,, | ౭౫ |
| ౧౯౦ ఆవిద్ధవక్ర | ,, | |
| ౧౯౧ రేచిత | ,, | |
| ౧౯౨ నితమ్బ | ,, | ౭౬ |
| ౧౯౩ లతా | ,, | |
| ౧౯౪ పక్షవఞ్చిత | ,, | |
| ౧౯౫ పక్షప్రద్యోత | ,, | ౭౭ |
| ౧౯౬ గరుడపక్ష | ,, | |
| ౧౯౭ నిషేధ | ,, | |
| ౧౯౮ మకర | ,, | |
| ౧౯౯ వర్ధమాన | ,, | ౭౮ |
| ౨౦౦ ఉద్వృత్త | ,, | |
| ౨౦౧ విప్రకీర్ణ | ,, | |
| ౨౦౨ అరాళకటకాముఖ | | ౭౯ |
| ౨౦౩ సూచ్యాస్య | ,, | |
| ౨౦౪ అర్ధరేచిత | ,, | |
| ౨౦౫ కేశబంధ | ,, | |
| ౨౦౬ ముష్టిస్వస్తిక | ,, | ౮౦ |
| ౨౦౭ నళినీపద్మకోశ | ,, | |
| ౨౦౮ ఉద్వేష్టితాలపద్మ | | |
| ౨౦౯ ఉల్బణ | ,, | ౮౧ |
| ౨౧౦ లాలిత | ,, | |
| అన్యగ్రం॥ సంయుతహస్తాః॥ ౨౩॥ | | |
| ౨౧౧ విప్రకీర్ణహస్తలక్షణమ్. | | |
| ౨౧౨ గజదంత | ,, | |
| ౨౧౩ తాలముఖ | ,, | ౮౨ |
| ౨౧౪ సూచీవిద్ధ | ,, | |
| ౨౧౫ పల్లవ | ,, | |
| ౨౧౬ నితమ్బ | ,, | ౮౩ |
| ౨౧౭ కేశబంధ | ,, | |
| ౨౧౮ లతా | ,, | |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౨౧౯ ద్విరథ | ,, | ౮౪ |
| ౨౨౦ ఉర్ధ్వవృత | ,, | |
| ౨౨౧ సంయమ | ,, | |
| ౨౨౨ ముద్రా | ,, | ౮౫ |
| ౨౨౩ అజముఖ | ,, | |
| ౨౨౪ అర్ధముకుళ | ,, | |
| ౨౨౫ రేచిత | ,, | |
| ౨౨౬ కుశల | ,, | ౮౬ |
| ౨౨౭ పక్షవత | ,, | |
| ౨౨౮ తిలక | ,, | |
| ౨౨౯ ఉత్థానవంచిత | ,, | |
| ౨౩౦ వర్ధమాన | ,, | ౮౭ |
| ౨౩౧ జ్ఞాన | ,, | |
| ౨౩౨ వైష్ణవ | ,, | |
| ౨౩౩ ఖణ్డచతుర | ,, | ౮౮ |
| ౨౩౪ అర్ధచతుర | ,, | |
| ౨౩౫ లీనముద్రా | ,, | |
| బాంధవ్యహస్తాః ॥ ౧౧॥ | | |
| ౨౩౬ దమ్పతీహస్తలక్షణమ్. | | |
| ౨౩౭ మాతృ | ,, | ౮౯ |
| ౨౩౮ పితృ | ,, | |
| ౨౩౯ శ్వశ్రూ | ,, | |
| ౨౪౦ శ్వశుర | ,, | |
| ౨౪౧ భర్తృభ్రాతృ | ,, | |
| ౨౪౨ ననందా | ,, | ౯౦ |
| ౨౪౩ జ్యేష్ఠకనిష్ఠభ్రాతృ | | |
| ౧౪౪ స్నుషా | ,, | |
| ౨౪౫ భర్తృ | ,, | |
| ౨౪౬ సపత్ని | ,, | |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| దేవతాహస్తాః ॥ ౧౬॥ | | |
| ౨౪౭ బ్రహ్మహస్తలక్షణమ్. | | ౯౧ |
| ౨౪౮ శమ్భు | ,, | |
| ౨౪౯ విష్ణు | ,, | |
| ౨౫౦ సరస్వతీ | ,, | |
| ౨౫౧ పార్వతీ | ,, | |
| ౨౫౨ లక్ష్మి | ,, | ౯౨ |
| ౨౫౩ విఘ్నేశ్వర | ,, | |
| ౨౫౪ షణ్ముఖ | ,, | |
| ౨౫౫ మన్మథ | ,, | |
| ౨౫౬ ఇంద్ర | ,, | |
| ౨౫౭ అగ్ని | ,, | |
| ౨౫౮ యమ | ,, | ౯౩ |
| ౨౫౯ నైఋతి | ,, | |
| ౨౬౦ వరుణ | ,, | |
| ౨౬౧ వాయు | ,, | |
| ౨౬౨ కుబేర | ,, | |
| నవగ్రహహస్తాః ॥ ౧౪॥ | | |
| ౨౬౩ సూర్యహస్తలక్షణమ్. | | |
| ౨౬౪ చన్ద్ర | ,, | |
| ౨౬౫ అఙ్గారక | ,, | ౯౪ |
| ౨౬౭ బృహస్పతి | ,, | |
| ౨౬౮ శుక్ర | ,, | |
| ౨౬౯ శనైశ్చర | ,, | |
| ౨౭౦ రాహు | ,, | |
| ౨౭౧ కేతు | ,, | ౯౫ |
| దశావతారహస్తాః॥౧౦॥ | | |
| ౨౭౨ మత్స్యావతారహస్తలక్షణం | | |
| ౨౭౩ కూర్మావతార | ,, | |

| విషయసంఖ్య. | పుటసంఖ్య. |
|---|---|
| ౨౭౪ వరాహావతారలక్షణమ్ | |
| ౨౭౫ నరసింహావతార ,, | |
| ౨౭౬ వామనావతార ,, | ౯౬ |
| ౨౭౭ పరశురామావతార ,, | |
| ౨౭౮ రఘురామావతార ,, | |
| ౨౭౯ బలరామావతార ,, | |
| ౨౮౦ కృష్ణావతార ,, | |
| ౨౮౧ కల్క్యవతార ,, | |
| ౨౮౨ రాక్షస ,, | ౯౭ |

చతుర్వర్ణహస్తాః॥౪॥

| విషయసంఖ్య. | పుటసంఖ్య. |
|---|---|
| ౨౮౩ బ్రాహ్మణహస్తలక్షణమ్ | |
| ౨౮౪ క్షత్రియ ,, | |
| ౨౮౫ వైశ్య ,, | |
| ౨౮౬ శూద్ర ,, | |

ప్రసిద్ధరాజహస్తాః॥౨౮॥

| విషయసంఖ్య. | పుటసంఖ్య. |
|---|---|
| ౨౮౭ హరిశ్చంద్రహస్తలక్షణమ్ | ౯౮ |
| ౨౮౮ నళమహారాజ ,, | |
| ౨౮౯ పురుమహారాజ ,, | |
| ౨౯౦ కుత్స ,, | |
| ౨౯౧ పురూరవ ,, | |
| ౨౯౨ సగర ,, | |
| ౨౯౩ దిలీప ,, | |
| ౨౯౪ అమ్బరీష ,, | |
| ౨౯౫ శిబి ,, | |
| ౨౯౬ కార్తవీర్య ,, | |
| ౨౯౭ రావణ ,, | |
| ౨౯౮ ధర్మరాజ ,, | |
| ౨౯౯ అర్జున ,, | |
| ౩౦౦ భీమసేన ,, | |
| ౩౦౧ శైబ్యహస్తలక్షణమ్ | |
| ౩౦౨ నకులహస్తలక్షణమ్ | |
| ౩౦౩ సహదేవ ,, | |
| ౩౦౪ నహుష ,, | |
| ౩౦౫ యయాతి ,, | |
| ౩౦౬ భగీరథ ,, | |
| ౩౦౭ మాంధాతృ ,, | |
| ౩౦౮ మరుత్త ,, | |
| ౩౦౯ రఘుమహారాజ ,, | |
| ౩౧౦ దశరథ ,, | |
| ౩౧౧ రామ ,, | |
| ౩౧౨ భరత ,, | |
| ౩౧౩ లక్ష్మణ ,, | |
| ౩౧౪ శత్రుఘ్న ,, | |

సముద్రాః॥౭॥

| విషయసంఖ్య. | పుటసంఖ్య. |
|---|---|
| ౩౧౫ లవణసముద్రహస్తల | ౧౦౦ |
| ౩౧౬ ఇక్షుసముద్ర ,, | |
| ౩౧౭ సురా ,, | |
| ౩౧౮ సర్పి ,, | |
| ౩౧౯ దధి ,, | ౧౦౧ |
| ౩౨౦ క్షీర ,, | |
| ౩౨౧ శుద్ధోదక ,, | |

పుణ్యనదీహస్తాః॥౧౪॥

| విషయసంఖ్య. | పుటసంఖ్య. |
|---|---|
| ౩౨౨ గంగానదీహస్తలక్షణమ్ | |
| ౩౨౩ యమునా ,, | |
| ౩౨౪ కృష్ణవేణీ ,, | |
| ౩౨౫ కావేరీ ,, | |
| ౩౨౬ సరస్వతీ ,, | |
| ౩౨౭ నర్మదా ,, | |

| విషయసంఖ్య. | పుటసంఖ్య. |
|---|---|
| ౩౩౮ తుంగభద్రాహస్తలక్షణం | |
| ౩౩౯ శరావతీ | ,, |
| ౩౪౦ వేత్రవతీ | ,, |
| ౩౪౧ చంద్రభాగా | ,, |
| ౩౪౨ సరయూ | ,, |
| ౩౪౩ భీమరథీ | ,, |
| ౩౪౪ సువర్ణముఖీ | ,, |
| ౩౪౫ పాపనాశనీ | ,, |
| ౩౪౬ ఊర్ధ్వలోక | ,, ౧౦౨ |
| ౩౪౭ అధోలోక | ,, |
| వృక్షహస్తాః॥ ౨౩॥ | |
| ౩౪౮ అశ్వత్థహస్తలక్షణమ్ | ౧౦౩ |
| ౩౪౯ కదళీ | ,, |
| ౩౫౦ నారంగ | ,, |
| ౩౫౧ లికుచ | ,, |
| ౩౫౨ పనస | ,, |
| ౩౫౩ బిల్వ | ,, |
| ౩౫౪ పున్నాగ | ,, |
| ౩౫౫ మందార | ,, |
| ౩౫౬ వకుళ | ,, |
| ౩౫౭ వట | ,, |
| ౩౫౮ అర్జున | ,, |
| ౩౫౯ పాటలీ | ,, |
| ౩౬౦ హింతాల | ,, |
| ౩౬౧ పూగ | ,, ౧౦౪ |
| ౩౬౨ చమ్పక | ,, |
| ౩౬౩ ఖదిర. | ,, |
| ౩౬౪ శమీ | ,, |
| ౩౬౫ అశోక | ,, |
| ౩౬౬ సిందువారహస్తలక్షణమ్ | |
| ౩౬౭ ఆమలక | ,, |
| ౩౬౮ కురవక | ,, ౧౦౫ |
| ౩౬౯ కపిత్థ | ,, |
| ౩౭౦ కేతకీ | ,, |
| ౩౭౧ శింశపా | ,, |
| ౩౭౨ నిమ్బ | ,, |
| ౩౭౩ సాల | ,, |
| ౩౭౪ పారిజాత | ,, |
| ౩౭౫ తింత్రిణీ | ,, |
| ౩౭౬ జమ్బూ | ,, |
| ౩౭౭ పాలాశ | ,, |
| ౩౭౮ రసాల | ,, ౧౦౬ |
| సింహాదిమృగహస్తాః॥ ౨౧॥ | |
| ౩౭౯ సింహహస్తలక్షణమ్ | |
| ౩౮౦ వ్యాఘ్ర | ,, |
| ౩౮౧ సూకర | ,, |
| ౩౮౨ కపి | ,, |
| ౩౮౩ భల్లూక | ,, |
| ౩౮౪ మార్జార | ,, ౧౦౭ |
| ౩౮౫ చమరీమృగ | ,, |
| ౩౮౬ గోధా | ,, |
| ౩౮౭ శల్యమృగ | ,, |
| ౩౮౮ కురంగ | ,, |
| ౩౮౯ కృష్ణసార | ,, |
| ౩౯౦ గోకర్ణ | ,, ౧౦౮ |
| ౩౯౧ మూషిక | ,, |
| ౩౯౨ గిరికా | ,, |
| ౩౯౩ శశ | ,, |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౩౯౪ | వృశ్చికహస్తలక్షణమ్ | |
| ౩౯౫ | శునక ,, | |
| ౩౯౬ | ఉష్ట్ర ,, | |
| ౩౯౭ | అజ ,, | |
| ౩౯౮ | గార్దభ ,, | |
| ౩౯౯ | వృషభ ,, | ౧౦౯ |
| ౪౦౦ | ధేను ,, | |
| | పక్షిహస్తా॥ ౨౧॥ | |
| ౪౦౧ | పారావతహస్తలక్షణమ్ | |
| ౪౦౨ | కపోత ,, | |
| ౪౦౩ | శశాదన ,, | ౧౧౦ |
| ౪౦౪ | ఉలూక ,, | |
| ౪౦౫ | గండభేరుండ ,, | |
| ౪౦౬ | చాతక ,, | |
| ౪౦౭ | కుక్కుట ,, | |
| ౪౦౮ | పిక ,, | |
| ౪౦౯ | వాయస ,, | |
| ౪౧౦ | కురర ,, | ౧౧౧ |

| విషయసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౪౧౧ | శుకహస్తలక్షణమ్ | |
| ౪౧౨ | సారస ,, | |
| ౪౧౩ | బక ,, | |
| ౪౧౪ | క్రౌఞ్చ ,, | |
| ౪౧౫ | ఖద్యోత ,, | ౧౧౨ |
| ౪౧౬ | భ్రమర ,, | |
| ౪౧౬ | మయూర ,, | |
| ౪౧౭ | హంస ,, | |
| ౪౧౮ | చక్రవాక ,, | |
| ౪౧౯ | కోయష్టిక ,, | |
| ౪౨౦ | వ్యాళి ,, | ౧౧౩ |
| | జలజంతుహస్తా॥ ౧౩॥ | |
| ౪౨౧ | భేకహస్తలక్షణమ్ | |
| ౪౨౨ | కుళీరహస్తలక్షణమ్ | |
| ౪౨౩ | రక్తపాయిహస్తలక్షణమ్ | |
| ౪౨౪ | నక్రహస్తలక్షణమ్ | |
| ౪౨౫ | డుండుభహస్తలక్షణమ్ | |


విషయసూచికసమాప్తం.


ఈపుస్తకము వలయువారలు దిగువసంతకము చేసియుండు వారి పేరిటికివ్రాసి వి. పి. మూలకముగా తెప్పించుకొనవచ్చును.

తి॥ స్వామినాథశాస్త్రి.

శాస్త్రసంజీవినీముద్రాక్షరశాలా

నెం॥ ౩౧౩- టంకశాలవీధి.

మింట్ బిల్డింగ్ మదరాస్.

శుభమస్తు.

శ్రీహయగ్రీవాయనమః.

నన్దికేశ్వర ప్రోక్తా

# అభినయదర్పణం.



## ఇష్టదేవతాప్రార్థనా.

శ్లో॥ ఆఙ్గికంభువనంయస్య వాచికంసర్వవాఙ్మయమ్।
ఆహార్యంచన్ద్రతారాదితన్నుమస్సాత్త్వికంశివమ్॥

తా॥ లోకము, ఏశివునియొక్క-అఙ్గాభినయమో; వాఙ్మయములైనవియెల్లఏశివునియొక్క వాచికాభినయమో; చంద్రతారాదులుఏశివునియొక్క ఆహార్యాభినయమో; అటువంటిసత్త్వప్రధానుండైన శివునికినమస్కరించెదను.

ఇంద్ర ఉవాచ॥ శ్లో॥ కళ్యాణాచలవాసాయ కరుణారససిన్ధవే।
నమోఽస్తునందికేశాయ నాట్యశాస్త్రార్థదాయినే॥

తా॥ కైలాసపర్వతనిలయుడును దయాసముద్రుడునునాట్యశాస్త్రార్థప్రదుడునైన నందికేశ్వరునికి నమస్కరించెదను.

నన్దికేశ్వర ఉవాచ॥శ్లో॥స్వాగతంతేసురాధీశ కుశలంత్రిదివౌకసామ్।
కిమర్థమాగతంబ్రూహి భవతామమసన్నిధౌ॥

తా॥ ఓయింద్రుడా? నీరాకమంచిది, స్వర్గవాసులందరునుక్షేమమా? నాదగ్గరకేమిటికివచ్చితివి చెప్పుము.

ఇన్ద్ర ఉవాచ॥శ్లో॥త్వదీయకృపయాపూర్వంనాట్యశాలామలఙ్కృతామ్।త్వదీయనర్తకస్సోఽయంత్వత్కృపామభివాఞ్ఛతి॥

తా॥ ఓయినందికేశ్వరుడా? తొల్లినీకృపారసముచేనలంకరింపబడిననర్తనశాలాధిపతియైన యీనీదాసుడగు నర్తకుడునీదయనుగోరివచ్చియున్నాడు.

నన్దికేశ్వర ఉవాచ॥శ్లో॥ మయావిధేయంకింతస్యవదవాసవతత్త్వతః॥

తా॥ ఓయింద్రుడా? వానికినాచేతజేయదగినదియేమున్నది - దానినిజముగజెప్పుము.

ఇన్ద్రఉవాచ॥శ్లో॥దైతేయనాట్యశాలాయాంసత్తికో నటశేఖరః।
తంవిజేతుమయంనాట్యవినోదైఃక్రమవేదిభిః।
భవద్విరచితంగ్రంథంభరతాఽర్ణవమిచ్ఛతి॥

తా॥ అసురనాట్యశాలయందు నటశేఖరుడనెడునటుడుగలడు-వాని నాట్యక్రమములను దేటపరచువిన్యాసములచే జయించుటకు మీచేరచియింపబడిన భరతార్ణవమనెడు గ్రంథమునపేక్షించుచున్నాడు.

నన్దికేశ్వరఉవాచ॥శ్లో॥చతుస్సహస్రసంఖ్యాతైర్గ్రంథైశ్చపరిపూరితమ్।భరతాఽర్ణవశాస్త్రంస్తుసుమతేశ్రుణుసాదరమ్॥

తా॥ ఓయింద్రుడా; నాలుగువేలగ్రంథములుగల భరతార్ణవమనెడు గ్రంథమునుజెప్పెదను - నీవత్యంతప్రీతిగలవాడవై వినుము.

ఇన్ద్రఉవాచ॥ శ్లో॥నన్దికేశదయామూర్తేవిస్తరాత్సంవిహాయమే।
సంక్షిప్యనాట్యశాస్త్రాఽర్థంక్రమపూర్వముదాహర॥

తా॥ దయామూర్తియైననందికేశ్వరుడా! ఈగ్రంథమునుసంగ్రహించినాట్యశాస్త్రమాత్రాఽర్థములను యథాక్రమముగానాకుజెప్పుము.

నన్దికేశ్వరఉవాచ॥శ్లో॥ వదామిసుమతేదేవసంక్షిప్యభరతాఽర్ణవమ్।
దర్పణాఖ్యమిదంసూక్ష్మమవధారయసాదరమ్॥

తా॥ ఓయింద్రుడా! భరతార్ణవమనెడుగ్రంథమును సంగ్రహించికొంచెముగాజేయబడినదర్పణమను నీగ్రంథమునుజెప్పెదను-దీనినాదరణగలవాడవై వినుము.

శ్లో॥ నాట్యంనృత్తంనృత్యమితిమునిభిఃపరికీర్తితమ్॥

తా॥ ఓయింద్రుడా! ఇదిఋషులచేనాట్యము నృత్తము నృత్యముఅని మూడువిధములవిభాగించి జెప్పబడియున్నది.

శ్లో॥ నాట్యంతన్నాటకేష్వేనయోజ్యంపూర్వకథాయుతమ్॥

తా॥నాట్యమనునదియెట్టిదనగా - నాటకమునందు పూర్వకథతోడ వినియోగింపబడునది.

శ్లో॥ రసభావవిహీనంతునృత్తమిత్యభిధీయతే॥

తా॥ నృత్తమనగా-రసభావములచేత తక్కువపడినదై తాళలయానుగుణ్యమైయుండునది.

శ్లో॥ రసభావవ్యంజకాఽదియుతంనృత్యమితీర్యతే॥

తా॥నృత్యమనగా-రసము,భావము,మొదలగువానితోగూడియుండునది.

శ్లో॥ ఏతత్త్రియంద్విధాభిన్నంలాస్యతాణ్డవసంజ్ఞికమ్॥

తా॥ ఈనాట్య నృత్త నృత్యములు మూఁడును మరలలాస్యమనియు, తాండవమనియు రెండువిధములుగా విభజింపబడియున్నవి.

శ్లో॥ సుకుమారంతయుతల్లాస్య ముద్ధతంతాణ్డవంవిదుః॥

తా॥ కూర్చుండియభినయించునట్టివి యెల్లనులాస్యమనియు, నిలిచి యభినయించునవియెల్లనుతాండవమనియు తెలియదగినది.

శ్లో॥ ద్రష్టవ్యౌనాట్యనృత్యేచ పర్వకాలేవిశేషతః॥

తా॥ నాట్యనృత్యములురెండునుపర్వకాలములయందు తప్పకచూడదగినవి. అది శ్రేయస్కరమనుట.

శ్లో॥ నృత్యంతత్రనరేన్ద్రాణా మభిషేకేమహోత్సవే।
యాత్రాయాం దేవయాత్రాయాంవివాహేప్రియసఙ్గమే॥
నగరాణామగారాణాంప్రవేశేపుత్రజన్మని।
శుభార్థిభిఃప్రయోక్తవ్యం మాఙ్గళ్యంసర్వకర్మసు॥

తా ॥ మీదజెప్పబడినమూఁటిలో మూఁడవదియగు నృత్యము మేలు కోరినవారిచే పట్టాభిషేకము, తిరునాళ్ల, ఊరేగింపు, దేవునియూరేగింపు, పెండ్లి, మిత్రసభ, పురప్రవేశము, గృహప్రవేశము, పుత్రోత్సవము వీనియందుజరపవలయును.

శ్లో॥ఋగ్యజుస్సామవేదేభ్యో వేదాచ్చాఽథర్వణాత్క్రమాత్ । పాఠ్యంచాఽభినయంగీతంరసాన్సఙ్గృహ్యపద్మభూః॥ వ్యరీరచచ్ఛాస్త్రమిదంధర్మకామార్థసిద్ధిదం। దుఃఖార్తిశోకనిర్వేదఖేదవిచ్ఛేదసాధనమ్॥ అపిబ్రహ్మపరానన్దాదిదమభ్యధికంభవేత్॥

తా॥ పూర్వకాలమునందు బ్రహ్మదేవుడు ఋగ్వేదమునుండిపాఠ్యమును, యజుర్వేదమునుండి యభినయమును, సామవేదమునుండి గానమును, అథర్వణవేదమునుండి రసములను, సంగ్రహించి యీశాస్త్రమునుచేసెను. ఇదిధర్మార్థకామమోక్షములను ఇచ్చునదియు కాక దుఃఖము, ఆర్తి, శోకము, నిర్వేదము, ఖేదము, మొదలైనవానిని బోఁగొట్టునదియు అగును. మరియుబ్రహ్మానందమునకంటె ఎచ్చైనయానందమును గలుగజేయునది. కలహము, వస్తునాశ, ప్రయత్నభంగాదులచేత గలుగునది దుఃఖము. ఇతరులుచేయుహింసాదులచేత గలుగునదిఆర్తి. మరణము మొదలగువానిచేతసంభవించునది శోకము, తనకిష్టవస్తుప్రాప్తి

కాసపుడును సారహీనతలోచినపుడును కలుగునది నిర్వేదము. గతశోక కృత్యములను తలచినపుడు పుట్టునది ఖేదము.

శ్లో॥ తత్రనృత్యంమహారాజ సభాయాంకల్పయేత్సదా॥

తా॥ ఈమీాదజెప్పిన మాటయందును నృత్యముమహారాజసభలోనెల్లప్పుడునుసంతోషముతోనడపుచుండవలయును. —సభాలక్షణమ్.—

శ్లో॥ సభాకల్పతరుర్భాతి వేదశాఖోపశోభితః।
శాస్త్రపుష్పసమాకీర్ణో విద్వద్భ్రమరసంయుతః॥

తా॥ సభయనెడికల్పవృక్షము వేదములనెడి కొమ్మలచేత ప్రకాశించునదియు, శాస్త్రములనెడి పుష్పములచేత నిండుకొన్నదియును, విద్వాంసులనెడి తుమ్మెదలతోగూడినదియునై వెలుగుచున్నది.

శ్లో॥ సత్యాచారసభాగుణోజ్జ్వలసభా సద్ధర్మకీర్తిస్సభా
వేదాలఙ్కృతరాజపూజితసభా వేదాన్తవేద్యాసభా॥
వీణావాణివిశేషలక్షితసభా విఖ్యాతవీరాసభా
రాజద్రాజకుమారశోభితసభా రాజత్ప్రకాన్తిస్సభా॥

తా॥ సత్యములెప్పక నడపువారుగలదియును, సద్గుణములచే మెరయునదియును, మంచిదర్మనమునుకీర్తియునుగలిగినదియు, వేదముచదివిన రాజులచేత పూజింపబడినదియు, వేదాంతమునెరిగినదియు, వీణాగానము, వాచికగానము మొదలగువానితో గూడినదియు, ప్రసిద్ధవీరులుగలదియు, తేజస్సుచేతవెలుగుచున్న రాజకుమారులచేత ప్రకాశించునదియు, ప్రకాశించుచున్నకాంతిగలదియుసభఅనబడును. అనగా సభయనునది యిన్నిలక్షణములునుగలదయి యుండవలయుననుట.

శ్లో॥ విద్వాంసఙ్కవయోభట్టాః గాయకాఙ్గపరిహాసకాః।
ఇతిహాసపురాణజ్ఞా స్సభాసప్తాఙ్గలక్షణమ్॥

తా॥ విద్వాంసులు, కవులు, పెద్దలు, పాఠకులు, పరిహాసకులు, ఇతిహాసములను తెలిసినవారు, పురాణములను తెలిసినవారు అనునవి యేడునుసభయొక్క యేడుఅంగములుఅగును.

సభానాయకలక్షణమ్.

శ్లో॥ శ్రీమాన్ధీమాన్వివేకీవితరణనిపుణోగానవిద్యాప్రవీణః।
సర్వజ్ఞఃకీర్తిశాలీసరసగుణయుతోహావభావేష్వభిజ్ఞః।
మాత్సర్యాదిత్యాగీహీనః ప్రకృతిహితసదాచారశీలోదయాళుః।

ధీరోదాత్తః కలావాన్ నృపనయచతురో సౌ సభానాయకస్స్యాత్॥

తా॥ సంపదగలవాడును, మంచిబుద్ధిమంతుడును, యుక్తాయుక్తవివేకముగలవాడును, దానశీలుడును, గానవిద్యయందు నేర్పుగవాడును, అన్నియు తెలిసినవాడును, కీర్తిచేతఒప్పినవాడును, సరసగుణములుగలవాడును, హావభావములయందలి తెలివిగలవాడును, మాత్సర్యాదిదుర్గుణములు లేనివాడును, ఆయాకాలమునకుదగిన మంచినడవళ్ళనెరిగినవాడును, దయగలవాడును, ధీరోదాత్తుడును, విద్వాంసుడును, రాజనీతియందుచతురుడును, అగువాడుసభానాయకుడుఅగును. బుద్ధియనగాఅప్పటికితోచునట్టిది॥ శ్లో॥ గ్రీవారేచకసంయుక్తో భ్రూనేత్రాదివిలాసకృత్। భావఈషత్ప్రకాశోయస్సహావఇతికథ్యతే॥ అనగామనోగతభావమును సంజ్ఞమొదలగువానిచేదెలుపుటహావము॥ శ్లో॥ నిర్వికారస్యచిత్తస్యభావస్స్యాదతివిక్రియా॥ వికారరహితచిత్తమునకునత్యంతవికారముకలుగుటభావము॥ శ్లో॥ గమ్భీరస్సారసమ్పన్నః కృపావానవికత్థనః।పరకీయగుణగ్రాహీధీరోదాత్తస్సకథ్యతే॥ గంభీరుడునుఅనగాకోపసంతోషములను అభినయాదికృత్యములచేదెలుపునట్టివాడును, దేహబలముగలవాడును, పరులదుఃఖమునుజూచి యోర్వలేనివాడును, తన్నుదాబొగడుకొననివాడును, ఇతరులగుణములను తెలిసికొనువాడునైనవాడు ధీరోదాత్తనాయకుడు.

మన్త్రిలక్షణమ్.

శ్లో॥ ఏధానస్థిరభాషిణోగుణపరాశ్శ్రీమద్యశోలమ్పటాః।
భావజ్ఞాగుణదోషభేదనిపుణాశ్శృంగారలీలారతాః।
మధ్యస్థానయకోవిదాస్సహృదయాస్సత్పణ్డితాభాన్తితే।
భూపాభేదవిచక్షణాస్సుకవయోయస్యప్రభోర్మంత్రిణః॥

తా॥ మాటనిలుకడగలవారును, సద్గుణములను గ్రహించువారును, భావముతెలిసికొనువారును, గుణదోషములను పరిశీలించుటయందు సమర్థులును, శృంగారలీలాసక్తులును, స్వజనపక్షపాతములేనివారును, నీతిపరిజ్ఞానులును, మంచిమనస్సుగలవారును, మంచిపండితులును, రాజులయొక్క అభేదవర్జనమునందు చతురులులు, పండితులును,అగుమంత్రులుఏప్రభువుదగ్గరగలరో యాప్రభువువృద్ధిపొందగలవాడు,

రజ్గలక్షణమ్,

శ్లో॥ ఏవంవిధస్సభానాథః ప్రాఙ్ముఖోనివసేన్ముదా।

వసేయుః పార్శ్వత స్తస్య కవిమన్త్రిసుహృజ్జనాః॥

తా॥ ఇట్లు సభానాయకుడు సంతోషముతో తూర్పుముఖముగా గూర్చుండగా వాని ప్రక్కలను, కవి, మంత్రి, సుహృజ్జనములుండవలయును.

శ్లో॥ తదగ్రే నటనం కార్యం తత్స్థలం రఙ్గముచ్యతే।

తా॥ ఆ రాజున కెదుట నటనము చేయవలయును. ఆ స్థలము రంగము అనబడును.

శ్లో॥ రంగమధ్యే స్థితే పాత్రే తత్సమీపే నటోత్తమః। దక్షిణే తాళ ధారీ చ పార్శ్వయోర్ద్వన్ద్వమృదఙ్గికః॥ తయోర్మధ్యే గీతకారశ్శ్రుతికార స్తదన్తరే। ఏవంతిష్ఠేత్క్రమేణైవ నాట్యాఽదౌ రంగమణ్డపే॥

తా॥ రంగమంటపమునడుమ పాత్రముండగా దానివెంబడి నటోత్తముడును, కుడితట్టు తాళగాడును, ఇరుప్రక్కలను మద్దెలగాడును, వారినడుమ పాత్రము ననుసరించి గాయకులును, వారికి వెనుక సుతిపోయువాడును, వరుసగా నుండవలయును.

పాత్రలక్షణమ్,

శ్లో॥ తన్వీ రూపవతీ శ్యామా పీనోన్నతపయోధరా। ప్రగల్భా సరసా కాన్తా కుశలా గ్రహమోక్షయోః॥ చారు తాళలయాఽభిజ్ఞా మణ్డలస్థానపణ్డితా। హస్తాఽంగస్థాననిపుణా కరణేషు విరాజినీ॥ విశాలలోచనా గీతవాద్య తాళాఽనువర్తినీ। పరార్థ్యభూషాసమ్పన్నా ప్రసన్నముఖపఙ్కజా॥ నాఽతిస్థూలా నాఽతికృశా నాఽత్యుచ్చా నాఽతివామనా। ఏవం విధగుణోపేతా నర్తకీ సముదాహృతా॥

తా॥ నటించెడు పాత్రము రూపవతియు, యౌవనమధ్యస్థురాలును, బలిసి నిక్కిన పాలిండ్లుగలదియు, ప్రౌఢత్వముగలదియు, రసికురాలును, సొగసుగలదియు, పట్టువిడుపులందు సమర్థురాలును, తాళలయగతులను దెలిసినదియు, మండలస్థాననృత్యమందు పండితురాలును, హస్తవిన్యాసాంగవిన్యాసములయందు నేర్పుగలదియు, అవయవచాకచక్యముగలదియు, విశాలములగు కన్నులుగలదియు, గీతవాద్యతాళములననుసరించిన నడచునట్టిదియు, వెలగల సొమ్ములు ధరించినదియు, తేటయైన ముఖముగలదియు, మిగులలావైనదిగాని మిగులబడుగైనదిగాని మిగుల చిక్కినదిగాని మిగుల పొట్టిదిగాని కానిదియునైయుండవలెను.

## అపాత్రలక్షణమ్.

శ్లో॥ పుష్పాక్షీ కేశహీనా చ పీనోష్ఠీ లమ్బకస్తనీ । అతిస్థూలాఽ
ప్యతికృశాఽప్యత్యుచ్చాఽప్యతివామనా । కుబ్జా చ స్వ
రహీనా చ వేశ్యా నాట్యే వివర్జితా॥

తా॥ పూలుపడియున్నకన్నులుగలదియు, తలవెండ్రుకలులేనిదియు, బలిసినదిపెదవులుగలదియు, వ్రేలబడినస్తనములుగలదియు, మిక్కిలిబలిసినదియు, మిక్కిలిచిక్కినదియు, మిక్కిలిపొట్టినదియు, గూనుగలదియు, హీనస్వరముగలదియు, అగువేశ్య నాట్యమునకుదగినదిగాదు.

## కిఙ్కిణీలక్షణమ్.

శ్లో॥ కిఙ్కిణీ కాంస్యరచితాః తామ్రేణ రజతేన వా ।
సుస్వరాశ్చ సురూపాశ్చ సూక్ష్మా నక్షత్రదేవతాః ॥
బధ్నీయాన్నీలసూత్రేణ గ్రన్థిభిశ్చ సమన్వితమ్ ।
శతద్వయం శతం వాఽపి పాదయోర్నాట్యకర్మణి ।
శతం వా దక్షిణే పాదే ద్విశతం వామపాదకే॥

తా॥ గజ్జెలుకంచువిగానైనను, రాగివిగానైనను, వెండివిగానైనను, ఉండవలయును. అవిమంచిస్వరముగలవిగాను అందమయినవిగాను చిన్నగానుఉండవలెను. అట్టినక్షత్రాధిదేవలుగలగజ్జెలను నల్లదారమున గ్రుచ్చి గజ్జెగజ్జెకుముడివేయవలయును. నాట్యమాడెడికాలములయందు పాత్రము కాళ్ళలో ఇన్నూరిన్నూరుగాని నూరునూరుగానయుండవలయును. లేకకుడికాలియందునూరును ఎడమకాలియందిన్నూరునైన నుండవలయును.

## నటలక్షణమ్.

శ్లో॥ రూపవాన్ మధురాఽభాషీ కృతీ వాగ్మీ పటుస్తథా । కులాంగనా
సుతశ్చైవ శాస్త్రజ్ఞో మధురస్వరః॥ గీతవాద్యాఽదినృత్యజ్ఞో సి
ద్ధకః ప్రతిభానవాన్ । ఏతాదృశగుణైర్యుక్తో నట ఇత్యుచ్యతే బుధైః॥

తా॥ చక్కనివాడును, ఇంపుగమాటలాడువాడులు, పండితుడును, మాటకారియు, సమర్థుడును, కులాంగనాసుతుడును, భరతశాస్త్రపరిజ్ఞానముగలవాడును, మంచిశారీరముగలవాడును, గానవాద్యనృత్యాదులలో పూర్ణజ్ఞానముగలవాడును, పట్టుగలిగినవాడును, కల్పనాశక్తిగలవాడునగుజనుడు పెద్దలచేతనటుడని చెప్పబడుచున్నాడు.

పాత్రబహిః ప్రాణలక్షణమ్.

శ్లో॥ మృదంగశ్చసుతాళౌ చ వేణుగీతి స్తతశ్శ్రుతిః। ఏకవీణాకిఙ్కిణీశ్చ గాయకశ్చసువిశ్రుతః ॥ ఇత్యేవమన్వయఙ్ఞైశ్చపాత్రప్రాణాబహిస్స్మృతాః॥

తా॥ మృదంగము, మంచినాదముగల తాళములు, పిల్లనగ్రోవి, పాట, శ్రుతి, వీణ, గజ్జెలు, ప్రఖ్యాతుడైననటుడు, ఇవినాట్యమాడెడుపాత్రమునకు బహిఃప్రాణములనిచెప్పబడును,

అన్తఃప్రాణలక్షణమ్.

శ్లో॥ జవస్థిరత్వ రేఖాచభ్రమరీదృష్టిరశ్రమః ।
మేధాశ్రద్ధావచోగీతి స్త్వన్తః ప్రాణాదశస్మృతాః॥

తా॥ వడి, నిలుకడ, సమత్వము, చపలత్వము, చూపు, శ్రమములేమి, బుద్ధి, శ్రద్ధ, మంచిమాటలు, పాటఈపదియును అంతఃప్రాణములనబడును.

నీచనాట్యలక్షణమ్.

శ్లో॥ అకృత్వాప్రార్థనం పాత్రమాచరేద్యదినాట్యకమ్।
తన్నాట్యంనీచమిత్యాహుర్నాట్యశాస్త్రవిచక్షణాః॥

తా॥ నటించెడిపాత్రము ఇష్టదేవతాప్రార్థనము మొదలగువానిని చేయకయేచేయునాట్యము నీచనాట్యమనినాట్యశాస్త్రజ్ఞులుచెప్పుదురు,

నీచనాట్యదర్శనఫలమ్.

శ్లో॥ నీచపాత్రకృతంనాట్యంయదిపశ్యంతిమానవాః ।
పుత్రహీనాభవిష్యంతిజాయంతేపశుయోనిషు॥

తా॥ నాట్యవర్జితపాత్రచే చేయబడిననాట్యమునుజూచినజనులుపుత్రహీనులై పశుయోనియందుజనింతురు.

నాట్యక్రమమ్.

శ్లో॥ తస్మాత్సర్వంసమాలోచ్య పూర్వకైర్యదుదాహృతమ్।
దేవతాప్రార్థనాదీనికృత్వానాట్యముపక్రమేత్॥

తా॥ ఆకారణమువలన పూర్వికులచేత నాట్యవిషయమునందు ఏమేమి చెప్పబడియున్నవో, వానినెల్లనుచక్కగాచూచి తెలిసికొని దేవతాప్రార్థనాదులనుచేసి నాట్యమునకు ప్రారంభింపవలయును.

శ్లో॥ కంఠేనాలమ్బయేద్గీతం హస్తేనార్థంప్రదర్శయేత్ ।
చక్షుర్భ్యాందర్శయేద్భావం పాదాభ్యాంతాళమాచరేత్ ॥

తా॥ నటించుపాత్రముకంఠము చేత గానమును హస్తాభినయము చే దానియర్థమును నేత్రములచే అందలిభావమును కాళ్ళతో తాళమునున డపవలయును,

శ్లో॥ యతో హస్త స్తతో దృష్టిర్యతో దృష్టి స్తతో మనః ।
యతో మన స్తతో భావో యతో భావ స్తతో రసః ॥

తా॥ ఎచ్చటహస్తము వినియోగింపబడునో అచ్చటదృష్టియు ఆదృష్టియున్న చోటనే మనస్సునుమనసున్న చోటనేభావమును ఉండునెడల, లరసము పుట్టును.

అభినయలక్షణమ్.

శ్లో॥ అత్రత్వభినయస్యైవ ప్రాధాన్యమితికథ్యతే॥

తా॥ రసభావాదిపరిజ్ఞానవిషయమందు అభినయమేముఖ్యమని చెప్పబడుచున్నది.

అభినయశబ్ద వ్యుత్పత్తిః.

శ్లో॥ అభిపూర్వస్యణీఞ్ ధాతో౽రాఖ్యానార్థస్యనిర్ణయః।
యస్మాత్పదార్థాన్నయతితస్మాదభినయస్స్మృతః॥

తా॥ అభియనునుపసర్గము పూర్వమునందుగల నీఞ నెడుధాతువుచే చెప్పబడునట్టిపదముల అర్థము యొక్క నిర్ణయముకలదికనుక ఆపదములయొక్క అర్థములను తెలుపుట అభినయముఅనబడును.

గ్రన్థాన్తరే.

శ్లో॥ అభివ్యంజన్విభావాను భావాదీన్నాటకాశ్రయాన్ ।
ఉత్పాదయన్సహృదయేరసజ్ఞానంనిరంతరమ్ ।
అనుకర్తృస్థిన్తో యోర్థోభినయస్సోభిధీయతే॥

తా॥ నాటకాశ్రయములయిన విభావానుభావాదులను తెలియజేయునదిగానురసికుల మనములకు నిరంతరరసజ్ఞానమును కలుగజేయునదిగాను అనుకర్తృనిష్ఠమైనరసభావాదులను(జూపువారియందుగల) అర్థముఅభినయమనబడును.

శ్లో॥ ఆఙ్గికో వాచిక స్తద్వదాహార్యస్సాత్వికపరః। చతుర్థాభినయ స్తత్రచా౽ఙ్గికో౽ఙ్గై ర్నదర్శితః । వాచావిరచితఃకావ్యనాటకా౽దిషువాచికః ॥ ఆహార్యోహారకేయూరవేషాదిభిరలఙ్కృతిః । సాత్వికస్సాత్వికై ర్భావై ర్భావజ్ఞైశ్చనిదర్శితః॥

తా॥ ఈయభినయము, ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్వికములనినాలుగువిధములగలది. అందుఅంగములచేత జూపబడునదిఆంగికము. మాటలచేత తెలుపబడునది వాచికము, ఇదికావ్యనాటకాదుల యందు గానబడుచున్నది. హారకేయూరాదుల నలంకరించుకొనుట ఆహార్యము. సాత్వికాదిభావములచేత అభినయించెడు పదభావముసాత్వికము. అనిభావజ్ఞులచేత చెప్పబడుచున్నది.

ఆఙ్గికాఽభినయత్రైవిధ్యమ్.

శ్లో॥ తత్రాఙ్గికోఽఙ్గప్రత్యఙ్గోపాఙ్గభేధా త్త్రిధామతః॥

తా॥ ఆంగికాభినయము, అంగాభినయము, ప్రత్యంగాభినయము,ఉపాంగాభినయముఅని, మూడువిధములుగలది.

అఙ్గలక్షణమ్.

శ్లో॥ అంగాన్యత్రశిరోహస్తౌకక్షగపార్శ్వకటీతటా।
పాదావితిషడుక్తానిగ్రీవామప్యపరేజగుః॥

తా॥ ఈయంగాభినయమందు, తల,చేతులు, చంకలు, లేకపార్శ్వములు, నడుము, పాదములుఈయారును అంగములనబడును. కొందరు కంఠమును సయితముఅంగమనిచెప్పెదరు.

ప్రత్యఙ్గలక్షణమ్.

శ్లో॥ ప్రత్యంగానిత్వథస్కంధౌబాహూపృష్ఠంతథోదరమ్ ।
ఊరూజఙ్ఘైషడిత్యాహురపరేమణిబన్ధకౌ ।
జానునీకూర్పరమితిత్రయమప్యధికంజగుః ॥

తా॥ ప్రత్యంగాభినయమందుమూపులు, చేతులు, వీపు,కడుపు, తొడలు, పిక్కలు ఈయారుప్రత్యంగములు,కొందరుమణికట్లు, మోకాళ్లు, మోచేతులునుగూడ ప్రత్యంగములనిచెప్పెదరు.

ఉపాఙ్గలక్షణమ్.

శ్లో॥ దృష్టిభ్రూపుటతారాశ్చకపోలౌనాసికాహనుః। అధరోదశనాజిహ్వాచుబుకంవదనంతథా । ఉపాంగానిద్వాదశైతే శిరస్యంగాన్తరేతథా । పార్ష్ణిగుల్ఫౌతథాఙ్గుళ్యఃకరయోఃపదయోస్తలే।ఏతానిపూర్వశాస్త్రానుసారేణోక్తానివైమయా॥

తా॥ చూపు, కెప్పపాటు, నల్లగుడ్డు, చెక్కిళ్ళు, ముక్కు, దవుడలు, ఆధరము, దంతములు,నాలుక, గడ్డము, మొగము, శిరస్సు-ఈపం

రెండును ఉపాంగములు. వీనిఅంగాంతరములుగాగుదికాలు, చీలమండ, కాళ్లచేతులవ్రేళ్లు, అరచేతులు ఇవిపూర్వశాస్త్రమునననుసరించినాచేతచెప్పబడినవి.

శ్లో॥ అంగానాంచలనాదేన ప్రత్యఙ్గోపాఙ్గయోరపి ।
చలనంప్రభవేత్తస్మాత్సర్వేషాంనాఽత్రలక్షణమ్॥

తా॥ అంగములయొక్కచలించుటవలననే ప్రత్యంగోపాంగములకు చలనముకలుగునుకాబట్టి వీనికన్నిటికిని వేరువేరుగా లక్షణములుచెప్పటఅనావశ్యకము.

శ్లో॥ నృత్యమాత్రోపయోగ్యానికథ్యం తేలక్షణైకశ్రమాత్।
ప్రథమంతుశిరోభేదః దృష్టిభేదస్తతఃపరమ్ ।
గ్రీవాహస్తౌచకార్యశ్చపక్షౌచతానిప్రకాశ్యతే ॥

తా॥ నృత్యమునకుఉపయోగమైనవిమాత్రము లక్షణయుక్తముగజెప్పబడును. మొదటశిరోభేదము, దృష్టిభేదము,గ్రీవాభేదము, హస్తభేదము, వీనివలనకలిగెడుభేదములు అందుబయలుపరపబడును.

అథనవవిధశిరోభేదాలక్ష్యన్తే.

శ్లో॥ సమముద్వాహితమధోముఖమాలోళితంధుతమ్ । కమ్పితఇచ్ఛపరావృత్తముత్క్షిప్తమ్పరివాహితమ్। నవధాకథితంశీర్షం నాట్యశాస్త్రవిచక్షణైః॥

తా॥ సమము, ఉద్వాహితము, అధోముఖము, ఆలోళితము, ధుతము, కంపితము, పరావృత్తము, ఉత్క్షిప్తము, పరివాహితము,అనిశిరోభేదములుతొమ్మిదివిధములుగలవిగానాట్యశాస్త్రజ్ఞులచేత చెప్పబడును.

౧,సమము॥శ్లో॥నిశ్చలంసమమాఽఖ్యాతమున్నత్యాఽనతివర్జితమ్॥

తా॥ తలనువంపక, పొడవుగానెత్తక, కదలింపకసమముగానిలుపునది సమశిరస్సు.

వినియోగము॥శ్లో॥ నృత్తాఽరమ్భేజపాదౌచ గర్వేప్రణయకోపయోః। స్తమ్భేనిష్క్రియాత్వేచసమశీర్షముదాహృతమ్॥

తా॥ నృత్తారంభము, జపాదులు, గర్వము,ప్రీతి, కోపము, స్తంభించియుండుట, క్రియారహితత్వము, వీనియందుఈశిరస్సు ఉపయోగింపబడును.

౨, ఉద్వాహితము॥ శ్లో॥ ఉద్వాహితశిరోజ్ఞేయ మూర్ధ్వభా
గోన్నతాఽనతమ్॥

తా॥ మీఁదికెత్తిసమముగానిలువబడినది యుద్వాహితశిరము.

వి॥ శ్లో॥ ధ్వజేచన్ద్రేచగగనే పర్వతేవ్యోమగామిషు ।
తుఙ్గవస్తునిసంయోజ్య ముద్వాహితశిరోబుధైః ॥

తా॥ ధ్వజము, చంద్రుఁడు, ఆకాశము, పర్వతము, ఆకాశమునసంచరించెడువస్తువు, పొడవగుపదార్థము, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౩-అధోముఖము॥ శ్లో॥ అధస్థాన్నమితంనక్త్రమధోముఖమితీరితమ్॥

తా॥ క్రింది ప్రక్కగావంచినశిరస్సు అధోముఖమనబడును.

వి॥ శ్లో॥ లజ్జాఖేదప్రణామేషుదుశ్చిన్తామూర్ఛయోస్తథా।
అధస్థితాఽర్థనిర్దేశేయుజ్యతేజలమజ్జనే॥

తా॥ సిగ్గు, ఖేదపడుట, మ్రొక్కుట, దురాలోచనచేయుట, మూర్ఛిల్లుట, క్రిందుగానుండుపదార్థమును నిర్ణయించుట, స్నానము. వీనియందు ఈశిరస్సుఉపయోగింపబడును.

౪-ఆలోళితము॥ శ్లో॥ మణ్డలాకారవద్భ్రాన్తమాలోళితశిరోభవేత్॥

తా॥ చక్రాకారముగాద్రిప్పబడినది యాలోళితశిరస్సనబడును.

వి॥ శ్లో॥ నిద్రోద్వేగేగ్రహాఽవేశేమదేమూర్ఛాఽతురాన్వితే।
భ్రమణేచవికల్పాఽదౌహాస్యేచాఽలోళితంశిరః॥

తా॥ తూఁగాడుట, దయ్యముసోకుట, మదము, మూర్ఛపోయినవాఁడు, గిరగిరతిరుగుట, వికల్పాదులు, నవ్వు, వీనియందు ఈశిరస్సుఉపయోగింపబడును.

౫, ధుతము॥ శ్లో॥ వామదక్షిణభాగేతుచలితంతద్ధుతంశిరః॥

తా॥ ఎడమకుడిప్రక్కలకు కదలించునట్టిదిధుత శిరస్సనబడును,

వి॥ శ్లో॥ నాఽస్తీతివచనేభూయఃపార్శ్వదేశాఽవలోకనే।జనాఽ
శ్వాసేవిస్మయేచవిషాదేఽనీప్సితేతథా।శీతార్తేజ్వరితేభీతే
సద్యఃపీతాఽసవేతథా।యుద్ధయత్నేనిషేధేచఅమర్షేస్వాఙ్గవీ
క్షణే।పార్శ్వాఽహ్వానేచతస్యోక్తఃప్రయోగోభరతాఽగమే॥

తా॥ లేదనుట, మాటిమాటికి ప్రక్కలఁజూచుట, జనులనూరడించుట, ఆశ్చర్యము, ఖేదము, ఇచ్ఛలేమి, చలి, మండుట, భయపడినది, [illegible]

ఉద్రోగినకళ్లు, యుద్ధప్రయత్నము, క్రోధము, కోపము, అవయవములను జూచుకొనుట, ప్రక్కలనుండువారలనుబిలుచుట, వీనియందుశిరస్సుఉపయోగింపబడును.

౬,కంపితము॥ శ్లో॥ ఊర్ధ్వాఽధోభాగచలితంకమ్పితంతచ్ఛిరోభవేత్॥

తా॥ క్రిందుమీదుగాగదలింపబడినది కంపితశిరస్సనబడును.

వి॥ శ్లో॥ రోషేతిష్ఠేతివచనేప్రశ్నసంజ్ఞోపహూతయోః ।
అవాహనేతర్జనేచ కమ్పితంతచ్ఛిరోభవేత్ ॥

తా॥ కోపము, ఉండుమనుట, అడుగుట, పిలుచుట, ఆవాహనము, బెదరించుట, వీనియందు ఈశిరస్సువినియోగింపబడును.

౭,పరావృత్తము॥ శ్లో॥ పరాఙ్ముఖీకృతంశీర్షంపరావృత్తమితీరితమ్॥

తా॥ ప్రక్కగాద్రిప్పినది పరావృత్తశిరస్సనబడును.

వి॥ శ్లో॥ తత్కార్యకోపలజ్జాఽదికృతేవక్త్రప్రసారణే ।
అనాదరేకచేతూర్ణ్యాం పరాఽవృత్తశిరోభవేత్॥

తా॥ అట్లుచేయుమనుట, కోపము, సిగ్గుమొదలైన వానివలనిచేష్ట ముఖమునుచాచుట, ఉపేక్షించుట, జడ, అమ్ములపొదివీనియందు ఈశిరస్సుఉపయోగింపబడును.

౮,ఉత్క్షిప్తము॥ శ్లో॥ పార్శ్వోర్ధ్వభాగచలితముత్క్షిప్తంనామశీర్షకమ్॥

తా॥ ఇరుప్రక్కలమీది భాగములందు చలింపజేయబడునది ఉత్క్షిప్తశిరస్సనబడును.

వి॥ శ్లో॥ గ్రహాణగచ్ఛేత్యాద్యర్థేసూచనేపరిపోషణే।
అఙ్గీకారేప్రయోక్తవ్యముత్క్షిప్తంనామశీర్షకమ్ ॥

తా॥ తీసికొనుము పొమ్ము అనుటమొదలగునవి, జాడచూపుట,పోషించుట,సంమతించుట, వీనియందుఉత్క్షిప్తశిరస్సుఉపయోగింపబడును.

౯,పరివాహితము॥ శ్లో॥ పార్శ్వోర్ధ్వయోశ్చామరవన్నతంచే
త్పరివాహితమ్॥

తా॥ వింజామరమువలె ఇరుప్రక్కలకువంపబడినది పరివాహిత శిరస్సనబడును.

వి॥ శ్లో॥ మోహేచవిరహేస్తోత్రే సన్తోషేచాఽనుమోదనే।
విచారేచప్రయోక్తవ్యం పరివాహితశీర్షకమ్॥

తా॥ వలపు, ఎడబాటు, పొగడు, సంతోషము, ఒప్పుకొనుట, విచారము, వీనియందు ఈశిరస్సు ఉపయోగింపబడును.

గ్రంథాంతరస్థశిరోభేదాః.

శ్లో॥ ధుతంవిధుతమాధూత మవధూతంచకంపితమ్। అకంపితోద్వాహితంచపరివాహితమంచితమ్ । నిహంచితంపరావృత్తముత్క్షిప్తాథోముఖేతథా । లోళితంచేతివిజ్ఞేయం చతుర్దశవిధంశిరః॥తిర్యఙ్నతోన్నతంస్కంధానతమారాత్రికంసమమ్ । పార్శ్వాభిముఖమిత్యన్యద్భేదంపంచపరేజగుః॥ సౌమ్యమాలోకితంచైవతిరశ్చీనంప్రకంపితమ్ । సౌందర్యంపంచధాప్రోక్తంశిరసాంలక్షణంతథా॥భరతాదిభిరాచార్యైశ్చతుర్వింశతిరీరితాః॥

తా॥ ధుతము, విధుతము, అధూతము, అవధూతము, కంపితము,అకంపితము, ఉద్వాహితము, పరివాహితము, అంచితము,నిహంచితము, పరావృత్తము, ఉత్క్షిప్తము, అధోముఖము, లోళితము,తిర్యఙ్నతోన్నతము, స్కంధానతము, ఆరాత్రికము, సమము, పార్శ్వాభిముఖము, సౌమ్యము, ఆలోకితము, తిరశ్చీనము, ప్రకంపితము, సౌందర్యము,అని శిరోభేదములు ఇరువదినాలుగువిధములుగా భరతాచార్యులు మొదలైనవారిచేజెప్పబడియున్నవి,

౧-ధుతము॥శ్లో॥ పర్యాయేణశనైస్తిర్యగ్గతముక్తంధుతంశిరః॥

తా॥ క్రమముచొప్పున మెల్లగానుఅడ్డముగాను ద్రిప్పబడునట్టిశిరము ధుతముఅనబడును.

వినియోగము॥శ్లో॥ శూన్యస్థానేక్షితేచైవపార్శ్వదేశావలోకనే। అనాశ్వాసేవిస్మయేచ విషాదేనీప్సితేతథా । ప్రతిషేధేచతస్యోక్తః ప్రయోగోభరతాదిభిః॥

తా॥ ఏమిలేనిచోటు, ప్రక్కలుచూచుట, ఊరటలేమి, ఆశ్చర్యము, ఖేదము, ఇచ్ఛలేమి,త్రోపుడువీనియందు ఈశిరస్సువినియోగింపబడును,

౨,విధుతము॥ శ్లో॥ ద్రుతగత్యధతత్తస్మాద్విధుతంతత్ప్రచక్షతే॥

తా॥ఆశిరస్సువడితోఅడ్డముగాద్రిప్పబడినయెడవిధుతముఅనబడును,

వి॥శ్లో॥ శీతార్దితేజ్వరితేభీతేసద్యః పీతాసవేతథా॥

తా॥ చలి, వేండ్రము, పిరికివాడు, అప్పుడుత్రాగినకల్లుగలవాడు వీరియందు ఈశిరస్సువినియోగింపబడును.

తా॥ నేనుచాలుదుననుట, గర్వించుట, వీనియందు ఈ శిరస్సు విని
యోగింపబడును.

౮-పరివాహితము॥ శ్లో॥ పరంమండలికాకారంభ్రామితంపరివాహితమ్॥

తా॥ చక్రాకారముగమిక్కిలిత్రిప్పబడినశిరస్సు పరివాహితమనబడును.

విని॥ శ్లో॥ లజ్జాభావేభ్రమేమానే వల్లభానుకృతౌతథా।
విస్మయేచస్మితేహర్షరోమాంచేపిప్రమోదనే॥
విచారేచవిచారజ్ఞైఃకార్యమాహురిదంశిరః॥

తా॥ సిగ్గులేమి, భ్రమము, మానము, ప్రియునిపోలిక, ఆశ్చర్యము,
చిరునవ్వు, సంతోషము, పులకాంకురము, సంతోషింపజేయుట, విచా
రము, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౯-అంచితము॥ శ్లో॥ శిరస్యాదంచితంకించిత్పార్శ్వయోర్నతకంధరమ్॥

తా॥ ఇరుప్రక్కలకును ఇంచుకవంపబడిన మెడగలశిరస్సు అంచి
తము అనబడును.

విని॥ శ్లో॥ దుశ్చింతామోహమూర్ఛాదౌతత్కార్యమధరేక్షణే॥

తా॥ దురాలోచనము, మోహము, మూర్ఛమొదలైనవి, పెదవిని
జూచుకొనుట, వీనియందు ఈశిరస్సు వుపయోగింపబడును.

౧౦ - నిహంచితము॥ శ్లో॥ ఉక్షిప్తబాహుశిఖరలగ్నగ్రీవంనిహంచితమ్॥

తా॥ పొడుపుగనెత్తబడిన మూపుతోజేరినమెడ ఆశిరస్సు నిహంచి
తము అనబడును.

విని॥ శ్లో॥ విలాసేలలితేగర్వేబిబ్బోకేకిలికించితే।
మోట్టాయితేకుట్టమితేమానేస్తంభేచతద్భవేత్॥

తా॥ విలాసము, లలితము, గర్వము, బిబ్బోకము, కిలికించితము,
మోట్టాయితము, కుట్టమితము, మానము, స్తంభము, వీనియందుయీ
శిరస్సు వినియోగింపబడును. ఇందలి విలాసము మొదలగువానిఅర్థము
భరతరసప్రకరణమునందు వివరింపబడియున్నది.

౧౧-పరావృత్తము॥ శ్లో॥ పరాఙ్ముఖీకృతంశీర్షంపరావృత్తంశిరోభవేత్॥

తా॥ పెడమొగముగలదిగాత్రిప్పబడినశిరస్సు పరావృత్తముఅనబడును.

విని॥ శ్లో॥ తత్కార్యకోపలజ్జాదికృతేవక్త్రప్రసారణే।
పరావృత్తానుకరణేపృష్ఠతఃప్రేక్షణేభవేత్॥

తా॥ అదిచేయుమనుట, కోపము, లజ్జ మొదలగుదానిచే నగుచేష్ట,

ముఖమునుచాచుట, ఒకతట్టుతిరిగినదాని ననుకరించుట, వెనుకతట్టు చూచుట, వీనియందు ఈశిరస్సు వినియోగింపబడును.

౧౨ - ఉత్క్షిప్తము॥ శ్లో॥ ఊర్ధ్వవక్త్రంశిరోజ్ఞేయముత్క్షిప్తంతత్రశస్యతే॥

తా॥ మీదికెత్తబడిన మొగముగలశిరస్సు ఉత్క్షిప్తముఅనబడును.

విని॥ శ్లో॥ దర్శనేతుంగవస్తూనాంచంద్రాదివ్యోమగామినామ్॥

తా॥ పొడువైనపదార్థములనుజూచుట, చంద్రుడుమొదలైనఆకాశమునందుసంచరించువానినిజూచుట, వీనియందు-ఈశిరస్సు వినియోగింపబడును.

౧౩-అధోముఖము॥శ్లో॥అధోముఖశిరోయత్రతత్రప్రాహురధోముఖమ్॥

తా॥ క్రిందు మొగముగావంచబడినశిరస్సుఅధోముఖము అనబడును.

శ్లో॥ లజ్జాఖేదప్రణామేషు స్యాదనర్థమధోముఖమ్॥

తా॥ సిగ్గు, దుఃఖము,మ్రొక్కుట,వీనియందు-ఈశిరస్సువినియోగించును.

౧౪-లోళితము॥ శ్లో॥ శిరస్స్యాల్లోళితంగర్వాధిక్యంశిథిలలోచనమ్॥

తా॥ గర్వాధిక్యము చేత తేలవేయబడినకన్నులుగలశిరస్సులోళితము అనబడును.

విని॥ శ్లో॥ నిద్రాగమగ్రహావేశమదమూర్ఛానుతన్మతమ్॥

తా॥ నిదురవచ్చుట, దయ్యముసోకుట, మదము, మూర్ఛ,వీనియందు ఈశిరస్సుచెల్లును.

౧౫- తిర్యఙ్నతోన్నతము॥ శ్లో॥ తిర్యఙ్నతోన్నతంప్రాప్తంశిరస్తిర్యఙ్నతోన్నతమ్॥

తా॥ అడ్డముగవంచియెత్తబడినశిరస్సుతిర్యఙ్నతోన్నతముఅనబడును.

వి॥ శ్లో॥ బిబ్బోకాదిషుకాంతానాంతత్ప్రయోజ్యంప్రచక్షతే॥

తా॥ స్త్రీలయొక్కబిబ్బోకము మొదలగువిలాసచేష్టలయందు ఈశిరస్సువినియోగింపబడును.

౧౬- స్కంధానతము॥ శ్లో॥ స్కంధానతంతదాఖ్యాతంస్కంధేయన్నిహితంశిరః॥

తా॥ మూపుమీదికివంపబడినశిరస్సుస్కంధానతముఅనబడును.

విని॥ శ్లో॥ తన్నిద్రామదమూర్ఛాసుచింతాయాంచప్రయుజ్యతే॥

తా॥ ఆశిరస్సు నిద్ర, మదము, మూర్ఛ, చింత వీనియందు ఉపయోగింపబడును.

అనుకూలముగామందరపర్వతమును పట్టునపుడు ఈకపిత్థహస్తము విష్ణువు వలనబుట్టెను. ఇది ఋషిజాతి. దీనికి ఋషి నారదుడు, వర్ణము తెలుపు, అధిదేవత పద్మగర్భుడు.

వి॥ శ్లో॥ సంధానాఽకర్షణే లక్ష్మ్యాం ధూపదీపనివేదనే। నటకా
నాంవిక్షేపవహనేఽంకుశవజ్రయోః। క్షేపణగ్రహణే తాళధా
రణే నాట్యదర్శనే। లీలాబ్జధారణే వాగ్దేవ్యాం జపదామనిరూపణే।
పేషణే యూపకాదీనాం చేలాఞ్చలసమాహృతౌ। ఋషిజాతౌ గౌ
రవర్ణే కపిత్థోయం నియుజ్యతే॥

తా॥ కవ్వమును బట్టి చిలుకుట, లక్ష్మి, ధూపదీపములను నివేదించుట, గవ్వలను ఎగజిమ్ముట, అంకుశవజ్రాయుధములను కట్టుట, ఒడిసెలత్రిప్పుట, తాళము కట్టుట, నాట్యము చూపుట, వినోదముగా తామరపుష్పము చేత పట్టుకొనుట, సరస్వతి జపమాలికను ధరించుట, లక్క మొదలగు వాని మెదుపుట, కొంగును లాగుట, ఋషిజాతి, గౌరవర్ణము, వీనియందు ఈహస్తము వినియోగించును.

౧౭. కటకాముఖహస్తలక్షణమ్.



శ్లో॥ కపిత్థతర్జనీ చోర్ధ్వం మిళితాఽంగుష్ఠమధ్యమా।
కటకాముఖహస్తోఽయం కీర్తితో భరతాదిభిః॥

తా॥ ముందు చెప్పిన కపిత్థహస్తమందు చూపుడు వ్రేలిని నడిమి వ్రేలితోను బొటనవ్రేలితోను జేర్చి పట్టబడు నేని కటకాముఖహస్తమగును.

వి॥ శ్లో॥ కుసుమాఽపచయే ముక్తాస్రగ్దామ్నాంచ ధారణే।
శరమందాఽకర్షణే చ నాగవల్లీప్రదానకే।
కస్తూరికాఽదివస్తూనాం పేషణే గంధవాసనే।
వచనే దృష్టిభావే చ కటకాముఖ ఇష్యతే॥

తా॥ పుష్పములు కోయుట, ముత్యాలదండ పూలదండలు ధరించుట, బాణమును మెల్లగా ఆకర్షించుట, ఆకుమడుపులిచ్చుట, కస్తూరి మొదలగు ద్రవ్యములను కలపుట, వాసనద్రవ్యములు చేర్చుట, మాట, చూపు, వీనియందు ఈహస్తము ఉపయోగింపబడును.

గ్రంథాంతరస్థకటకాముఖలక్షణమ్.

శ్లో॥ అత్యాంగుష్ఠయుతౌ క్షిప్తౌ కపిత్థే కటకాముఖః। అభ్యస్య చ ధను

ర్విద్యాగుహేన శివసన్నిధౌ। కటకాముఖహస్తోభూద్భార్గవో
ఋషిరుచ్యతే। దేవజాతిస్తామ్రవర్ణో రఘురామోస్య దేవతా॥

తా॥ కపిత్థహస్తముయొక్క బొటనవ్రేలు ఎత్తిపట్టబడునేని కటకాముఖహస్తమగును. శివునియొద్ద కుమారస్వామి విలువిద్య నేర్చునపుడు కటకాముఖహస్తము పుట్టెను. ఇది దేవజాతి. దీనికి ఋషి భార్గవుడు, వర్ణము తామ్రము, అధిదేవత రఘురాముడు.

వి॥ శ్లో॥ ముక్తాస్రజాం పుష్పదామ్నాం చామరాణాం చ ధారణే। ఆకర్షణే శరాదీనాం దర్పణాభిముఖగ్రహే। ఖతీనే వాహనే న్యంతభేదనే దంతధావనే। కుసుమాపచయే నాగవల్లీదళపరిగ్రహే। కస్తూరికాదిసంపేషే వారస్త్రీణాం నిగూహనే। ధనురాకర్షణే చక్రధారణే వ్యజనగ్రహే। స్వర్ణవర్ణే దేవజాత్యాం యుజ్యతే కటకాముఖః॥

తా॥ ముత్యాలసరము పూలదండ వింజామరము వీనిని ధరించుట-బాణము మొదలైనవానిని ఆకర్షించుట, అద్దము నెదుటికి తెచ్చుట, కిర్లెము, వాహనము, తొడిమను త్రుంచుట, పండ్లుతోముట, పుష్పములు కోయుట, ఆకుమడుపులిచ్చుట, కస్తూరి మొదలగువస్తువులను మెదుపుట, భోగమువారి కౌగిలింత, వింటినితిగుచుట, చక్రాయుధమును ధరించుట, విసనకర్ర పట్టుట, బంగారువన్నె, దేవజాతి, వీనియందు ఈహస్తము వినియోగించును.

౭. సూచీహస్తలక్షణమ్.



శ్లో॥ ఊర్ధ్వం ప్రసారితా యత్ర కటకాముఖతర్జనీ। భవేత్సూచీకరస్సోఽయం కీర్తితో భరతాగమే॥

తా॥ ముందు చెప్పిన కటకాహస్తమునందలి చూపుడువ్రేలు పొడుగుగా చాచబడినయెడ సూచీహస్తమగును.

వి॥ శ్లో॥ ఏకార్థేఽపి పరబ్రహ్మభావనాయాం శతేఽపి చ। రవౌ నగర్యాం లోకార్థే తథేతి వచనేఽపి చ। యచ్ఛబ్దేఽపి తచ్ఛబ్దే వ్యజనార్థేఽపి తర్జనే। కార్శ్యే శలాకావపుషోరాశ్చర్యే వేణిభావనే। ఛత్రే సమర్థే కోణే చ రోమాళ్యాం భేరీభేదనే। కులాలచక్రభ్రమణే రథాంగే మండలే తథా। వివేచనే దినాంతే చ సూచీహస్తః ప్రకీర్తితః॥

తా॥ ఒకటిఅనుఅర్థము, పరబ్రహ్మము,తలపు,నూరుఅనుట, సూర్యుడు, నగరము, లోకముఅనునర్థము, అట్లుఅనుట, ఎవడుఎవతెఏదియనుట,వాడుఆమెఅదియనుట, విసనకఱ్ఱ,వెరపించుట, కృశించుట,సలాక,దేహము, ఆశ్చర్యపడుట,జనుచూపుట, గొడుగు, నేర్పరితనము, మూలఅనుట,నూగారు, భేరివాయించుట, కుమ్మరవానిచక్రముతిరుగుట, బండిచక్రము, సమూహము, వివరించుట, సాయంకాలము, వీనియందుఈహస్తమువినియోగించును,

## గ్రన్థాన్తరస్థసూచీముఖ హస్తలక్షణమ్.

శ్లో॥ సూచీముఖోభవేదూర్ధ్వంకటకాముఖతర్జనీ। అహమేకఇతి బ్రహ్మనిర్దేశమకరోద్యతః। తస్మాత్ప్రాత్ప్రాఙ్జాతో సూచిరస్యఋషిరవిః। దేవజాతిశ్శ్వేతవర్ణోవిశ్వకర్మాధి దేవతా॥

తా॥ కటకాముఖహస్తముయొక్క చూపుడువ్రేలుపైకెత్తబడెనేని సూచీహస్తమవును. పూర్వకాలమునందుబ్రహ్మ నేనొకడనేయనినిర్దేశించునపుడు ఆబ్రహ్మవలనఈసూచీ హస్తముపుట్టెను. ఇదిదేవజాతి.దీనికిఋషిసూర్యుడు. వర్ణము శ్వేతము. అధిదేవతవిశ్వకర్మ.

వి॥శ్లో॥ శ్లాఘాయాంసత్యవచనేదూరదేశనిరూపణే। ప్రాణార్థేచపురోగేపిఏకసఙ్ఖ్యానిరూపణే॥ సంధ్యాయాంవిజనేనాశేసాధువాదేనిరీక్షణే। తథాతివచనేలోకేపరబ్రహ్మనిరూపణే। ఏకాన్తేపిశలాకాయాంరథాఙ్గభ్రమణేరవౌ। ఉదయాస్తమయేబాణేరూఢేనాయకదర్శనే। శిలీముఖేచయచ్ఛబ్దేతచ్ఛబ్దేపినాశయోః। తర్జనేసీచసంబుద్ధౌ శ్రవణేవిరహేస్మృతౌ। భ్రూణేచఖ్యాత్వం.శ్వేతవర్ణేదర్శనేసూచికఃకరః॥

తా॥ శ్లాఘించుట,నిజము, దూరమునుజూపుట, ప్రాణమనుట, ముందుగపోవువానిజూపుట, పదిసిజూపుట. సంధ్యాకాలము, ఏకాంతప్రదేశము [illegible]డు, బాగనుట,చూపు. అట్లేయనుట,లోకము,పరబ్రహ్మనిరూపణ. ఒకటేయనునర్థము, సలాక,చక్రమునుత్రిప్పుట, సూర్యుడు,ఉదయాస్తమయములు, బాణము,సహస్యము, నాయకునిజూచుట, అలుగుగలబాణము, ఎదిఅదిఅనుట,ఇనుము,కమ్మి, జెదరించుట, నీచునిపిలుచుట,వినుట,విరహము,తలచుట, ముక్కు,పక్షిముక్కు, తెల్లవర్ణము,చూచుట,వీనియందుఈహస్తము వినియోగపడును,



### ౧౪, చన్ద్రకలాహస్తలక్షణమ్.

వి॥శ్లో॥సూచ్యామఙ్గుష్ఠమోక్షేతుభవేచ్చన్ద్రకలాకరః।
ఏషాచన్ద్రకలాచన్ద్రకలాయామేవయుజ్యతే॥

తా॥ ముందుచెప్పినసూచీహస్తమునందు బొటన వ్రేలిని విడిచినయెడ చంద్రకలాహస్తమగును. ఈ చంద్రకలాహస్తము కలామాత్రచంద్రునియందు వినియోగింపబడును.



### ౧౫, పద్మకోశహస్తలక్షణమ్.

శ్లో॥అఙ్గుళ్యోవిరళాఃకిఞ్చిత్కుఞ్చితాస్తలనిమ్నగాః।
పద్మకోశాఽభిధోహస్తస్తన్నిరూపణముచ్యతే॥

తా॥ అయిదువ్రేళ్లనువెడముగాచాచికొంచెము వంచిఅరచేయిపల్లమగునట్లుపట్టబడునెడ పద్మకోశహస్తమగును.

వి॥శ్లో॥ ఫలేబిల్వకపిత్థాఽదౌస్త్రీణాంచకుచకుమ్భయోః।వర్తులేకందుకేస్వల్పభోజనే పుష్పకోశకే॥ సహకారఫలేపుష్పవర్షేమంజరికాఽదిషు। జపాకుసుమభావేపిఘణ్టారూపవిధానకే॥ వల్మీకేకుముదేప్యండేపద్మకోభిధీయతే।

తా॥ మారేడుపండు, వెలగపండు, స్తనములు, వర్తులము, పువ్వుచెండు, అల్పాహారము, పూమొగ్గ, మామిడిపండు, పూలవాన, పూగుత్తిమొదలుగునది, మంకెనపువ్వు, ఘంటారూపమునుజూపుట, పాములపుట్ట, నల్లకలువ, గ్రుడ్లు, వీనియందుఈహస్తము ఉపయోగించును.

### గ్రంథాంతరస్థపద్మకోశహస్తలక్షణమ్.

శ్లో॥ వరశ్వేతామ్బుజాకారో పద్మకోశోభిధీయతే।చక్రార్థేనపద్మనికరైశ్శమ్భుపూజాంవితన్వతః । నారాయణాత సంభూతోజాతోపద్మధరోఋషిః। యక్షాన్వయఃకిన్నరాంశో,తూ। వాస్యభార్గవః॥ ముని నే

తా॥శ్రేష్ఠమయినతెల్లదామరయాకృతిగాపట్టబడినదిపద్మకోశమనబడును. పూర్వకాలమునందు చక్రాయుధముకొరకుపద్మసమూలచేతశివపూజచేయుచున్నవిష్ణుదేవునివలనఈపద్మకోశహస్తమాయెను,ఇదియక్షజాతి,కిన్నరాంశము.దీనికిబ్రహ్మఋషి,భార్గవుడుఅధి

వి॥శ్లో॥ శుణ్డాయాం థాళిథళ్యేచ హేమరౌప్యాదిభాజనే। ధమ్మిల్లే దమితాధి చలాన్యస్యాప్యువాదనే॥ ఘంటాయాంకరండకే పద్మేవల్మీకేవర్తులే స్తనే । నారికేళేచమాతులకేకద్లికారేచదర్పణే । శేఖావతో పుష్పవస్త్రేకలశేద్రావిశాసనే । బిల్వేకపిత్థే యుజ్యేతపద్మకోశాహ్వయః కరః॥

తా॥ ఏనుగుతొండము, థళథళయనుకాంతి, బంగారువెండిమొదలయినపాత్రము, కొప్పు, కొలది, అందము, భాగ:అనుట, ఘంట, పుట్టచెండు, తామర, పుట్ట, గుండ్రని, కుచము. టెంకాయ, మాదిఫలపండు, కొండగోగు, అద్దము, కొప్పునంగుట, పూలవాన, మారేడుపండు, వెలగపండు, వీనియందు ఈహస్తమువినియోగించును.

౧౬, సర్పశీర్షహస్తలక్షణమ్.



శ్లో॥ పతాకతలనిమ్నత్వాత్సర్పశీర్షకరోభవేత్॥

తా॥ పతాకహస్తముయొక్క అరచెయ్యి కొంచెము పల్లముగవంచబడినయెడ సర్పశీర్షహస్తమగును.

వి॥శ్లో॥ చన్దనేభుజగేమందే ప్రోక్షణేపోషణాదిషు। దేవర్ష్యాదికదానేషుహ్యాస్ఫాలేగజకుమ్భయోః। భుజాస్ఫాలేతుమల్లానాంయుజ్యతేసర్పశీర్షకః॥

తా॥ గంధము, పాము, మెల్లగాననుట, నీళ్ళుచిలుకరించుట, ప్రోచుట మొదలగునవి, దేవర్షితర్పణములు, ఏనుగుకుంభస్థలములను చరచుట, జెట్టిలు భుజము చరచుట, వీనియందు ఈహస్తము ఉపయోగబడును.

గ్రంథాంతరస్థసర్పశీర్షహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకేనిమ్నమధ్యత్వేసర్పశీర్ష ఇతిస్మృతః । నిరీక్ష్యనిజ్జరాన్ప్రతాన్ఛరవిన్యాసపూర్వకమ్। బలింవఞ్చయితుంభూర్యోఽభవేయమితిభాషతః । వామనాత్సర్పశీర్షోయం వామనోఋషిరుచ్యతే।హరిద్వర్ణోదేవజాతిః కాలకంఠోధిదేవతా॥

తా॥ పతాకహస్తమునంగలి అరచేయిపల్లముగా పట్టబడునేనిసర్పశీర్షహస్తమగును. పూర్వకాలమునందుబలిచక్రవర్తికి వెరచి తన్నుశరణుచొచ్చినదేవతలనుగూర్చి విష్ణుదేవుడువామనావతారమెత్తి బలిని వంచించెదనని చేయిచాచిచెప్పినపుడు ఆవామనునివలన

ఈసర్పశీర్షహస్తము పుట్టెను. ఇది దేవజాతి. దీనికి ఇంద్రుడు ఋషి, పుసర్ణము, శివుడు అధిదేవత,

వి॥ శ్లో॥ కుఙ్కుమేపఙ్కభావేపి ప్రాణాయామనిరూపణే । ముఖప్రక్షాళనవిధౌ దానవేళావివేచనే । చన్దనేచగజేఖర్వే మల్లాస్ఫాలేచలాలనే । క్షీరేనీరేచకాశ్మీరేలజ్జాయాం గోప్యకేశిశౌ। ప్రతిమాయాంపయః పానేలీనేసత్పరిభాషణే। బ్రహ్మజాతౌ హరిద్వర్ణేయుక్తమిత్యుత్తరీకృతౌ । పటవాసపరిక్షేపే చన్దనాదివిలేపనే। కుచాదిగ్రహణేస్త్రీణాంసర్పశీర్షోనియుజ్యతే॥

తా॥ కుంకుమము, అడుసు, ప్రాణాయామమును జూపుట, మొగము కడుగుకొనుట, దానకాలమును నిరూపించుట, గంధము, ఏనుగు, పొట్టివాడు, జెట్టిలు బుజము చరచుట, బుజ్జగించుట, పాలు, నీరు, కుంకుమపువ్వు, సిగ్గు, దాచదగిన వస్తువు, పసిబిడ్డ, బొమ్మ, నీళ్ళు త్రాగుట, ఐక్యము, మంచిదనుట, బ్రహ్మజాతి, పసుపువన్నె, తగుననుట, ఉత్తరము చెప్పుట, గంధపొడి చల్లుట, గంధము మొదలగువాని పూత, స్తనము మొదలగువానిని పట్టుకొనుట, వీనియందు ఈహస్తము వినియోగించును.

౧౭, మృగశీర్షహస్తలక్షణమ్.



శ్లో॥ అస్మిన్నేకనిష్ఠికాఙ్గుష్ఠేప్రసృతేమృగశీర్షకః॥

తా॥ ముందుచెప్పిన సర్పశీర్షహస్తమందలి చిటికెనవ్రేలును బొటనవ్రేలును చాచబడునేని మృగశీర్షహస్తమగును.

వి॥ శ్లో॥ స్త్రీణామర్థే కపోలేచక్రమమర్యాదయోరపి। భీతేవివాదేనైపథ్యేఽప్యావాసేచత్రిపుండకే। ముఖాముఖేరంగవల్ల్యాంపాదసంవాహనేపిచ। సర్వసమ్మేళనేకార్యే మన్దిరేఛత్రధారణే। సోపానేపదవిన్యాసే ప్రియాఽహ్వానేతథైవచ। సఞ్చారేచప్రయుజ్యేత భరతాఽగమకోవిదైః॥

తా॥ స్త్రీవిషయము, చెక్కిలి, క్రమము, మర్యాద, వెరపు, వాదు, అలంకారము, ఉనికిపట్టు, విభూది పెట్టుకొనుట, ఎదురెదురు, ముగ్గు, పిసుకుట, అన్నిటినికూర్చుట, ఇల్లు, గొడుగు బట్టుకొనుట, మెట్టు, అడుగుపెట్టుట, ప్రియులను బిలుచుట, తిరుగుట, వీనియందు ఈహస్తము వినియోగించును.

### గ్రంథాంతరస్థమృగశీర్షహస్తలక్షణమ్.

శ్లో॥ ఊర్ధ్వాగశ్చతురాంగుష్ఠో మృగశీర్షకరః స్మృతః। శివం ప్రతి తపః కర్తుం ధారయిత్వా త్రిపుండ్రకమ్। మృగశీర్షోభవద్గౌర్యాః ఋషిరస్య మృకండుజః॥ ఋషిజాతిశ్శుభ్రవర్ణోఽస్యాధీశోపి మహేశ్వరః॥

తా॥ చతురహస్తాంగుష్ఠము వెలుపలికెత్తబడెనేని మృగశీర్షహస్తమాను. మహేశ్వరుని గూర్చి తపస్సు చేయుటకు పార్వతీదేవి త్రిపుండ్రము నుధరింపగా ఈ హస్తము పుట్టెను. ఇది ఋషిజాతి. దీనికి ఋషి మార్కండేయుడు. వర్ణము తెలుపు, అధిదేవత మహేశ్వరుడు.

వి॥శ్లో॥ భిత్తౌ విచారే సమయే ఆవాసే ఛత్రధారణే। పద్మిన్యామపి శంకిన్యాం హస్తిన్యాం మందవాచకే॥ లేపనే చందనాదీనాం స్త్రీణామభినయక్రమే। తిరస్కరిణ్యాం సోపానే సాక్షాత్కారేపి చ క్రమే। త్రిపుండ్రధారణే చైవ వితర్కే చ మృగాననే। అస్మదర్థే శరీరే చ సంజ్ఞాపూర్వసమాహృతౌ। ఋషిజాతౌ సుధావర్ణే మృగశీర్షకరః స్మృతః॥

తా॥ గోడ, విచారము, సమయము, నివాసస్థానము, గొడుగుపట్టుట, పద్మినీ శంకినీ హస్తినీజాతి స్త్రీలు, మెల్లగా ననుట, గంధము మొదలగువాని పూత, స్త్రీబోధకాభినయము, త్రిపుండ్రధారణము, వితర్కము, మృగముయొక్క మొగము, తెర, మిద్దెలోనగు వాని మెట్టు, ప్రత్యక్షము, క్రమము, నేను అనుట, దేహము, సైగచే గ్రహించుట, ఋషిజాతి, తెల్లవన్నె, వీనియందు ఈ హస్తము ఉపయోగించును.

### ౧౮. సింహముఖహస్తలక్షణమ్.



శ్లో॥ మధ్యమానామికాగ్రాభ్యామఙ్గుష్ఠో మిశ్రితో యది। శేషౌ ప్రసారితౌ యత్ర స సింహముఖ ఈరితః॥

తా॥ నడిమి వ్రేలు ఉంగరపు వ్రేలు ఈ రెంటి కొనలను బొటనవ్రేలితో చేర్చి తక్కిన వ్రేళ్ళను జాచి పట్టిన యెడ సింహముఖహస్తమగును.

వి॥శ్లో॥ విద్రుమే మౌక్తికే చైవ సుగన్ధే లకస్పర్శనే। ఆకర్ణనే చ పృషతీ మోక్షార్థే హృది సంస్థితః॥ హోమే శశే

గజేదర్భచలనేపద్మధామని। సింహాసనేవైద్యపాకశోధనేసిం
హావక్త్రకః॥

తా॥ పగడము, ముత్యము, మంచివాసన, ముంగురులుదిద్దుట, వినుట, నీటిబొట్టు, (రొమ్మునవిలిపిన తొడ) మోక్షవిషయము, హోమము, కుందేలు ఏనుగు, దర్భనువిదలించుట, తామరపూలదండ, సింహముయొక్క మొగము, వైద్యుడుమందు వండుటనుశోధించుట, వీనియందు ఈహస్తమువినియోగించును.

## ౧౯. లాఙ్గూలహస్తలక్షణమ్.



శ్లో॥ పద్మకోశేఽనామికా చేన్నమ్రా లాఙ్గూలకో భవేత్

తా॥ పద్మకోశహస్తమందు ఉంగరపువ్రేలువంచిపట్టిన యెడలాంగూలహస్తమగును.

వి॥ శ్లో॥ లికుచస్యఫలే బాలాకుచే కల్హారకే తథా।
చకోరే క్రముకే బాలకిఙ్కిణ్యాం ఘుటికాదికే।
చాతకే యుజ్యతే చాఽయం లాఙ్గూలకరనామకః॥

తా॥ గజనిమ్మపండు, పడుచులచన్నులు, వాసనగలఎఱ్ఱకలువ, చకోరము, పోక, చిరుగజ్జెలు, గసగుండు మొదలుగునవి, చాతకపక్షి వీనియందు ఈహస్తమువినియోగించును.

### గ్రంథాంతరస్థలాఙ్గూలహస్తలక్షణమ్,

శ్లో॥ మధ్యమాఙ్గుష్ఠతర్జన్యో నారికేళాక్షవత్కృతౌ। లాఙ్గూలో నా
మికావక్రా ప్రోన్నతా చకనిష్ఠికా। క్షీరోధిజః కాలకూటః గుళికా
కృతికే పురా। లాఙ్గూలో హరసఞ్జాతో ఋషిః క్రౌఞ్చవిదారణః। సిద్ధ
జాతిస్స్వర్ణవర్ణః పద్మాతస్యాధిదేవతా॥

తా॥ నడిమివ్రేలుబొటనవ్రేలుచూపుడువ్రేలువీనినిటెంకాయకన్నుల తీరుననిలిపి ఉంగరపువ్రేలినివంచిచిటికెనవ్రేలినిపైకెత్తిపట్టబడునది లాంగూలహస్తము అనబడును. ఈహస్తము పూర్వకాలమునందు పాలసముద్రమునందుబుట్టిన కాలకూటవిషమును మ్రింగుటకై శివుడుగుళిగగా జేసిపట్టినపుడు శివునివలనబుట్టినది. దీనికిఋషి. కుమారస్వామి. వన్నె బంగారు. అధిదేవత లక్ష్మి.

వి॥ శ్లో॥ ద్రాక్షాఫలే చ రుద్రాక్షే చుబుకగ్రహణేఽపి చ। కుచప్రరోహే క్ర
ముకే కిఙ్కిణ్యాముత్పలే ఫలే। విద్రుమే చ మితగ్రాసే నక్షత్రే బద

రీఫలే। వర్తులాయాం మల్లికాబ్జే చకోరే చాతకేఽల్పకే। కర
కాయాం సిద్ధజాతౌ హరితక్యాం సువర్ణకే। ఏవమాదిషు యు
జ్యేత హస్తో లాఙ్గూలసంజ్ఞకః॥

తా॥ ద్రాక్షపండు, రుద్రాక్షు, నిమ్మపండు, గడ్డముపట్టుకొనుట, మొలకచన్ను, పోక, చిరుగజ్జెలు, కలువపండు, పగడము, కొద్దిపాటి బళము, నక్షత్రము, రేగుపండ్లు, స్రువ, మల్లెపువ్వు, చకోరపక్షి, చాతకపక్షి, అల్పవస్తువు, వడగళ్లు, సిద్ధజాతి, కరకకాయ, బంగారు, ఇవి మొదలగువానియందు ఈహస్తము వినియోగించును.



## ౨౦. సోలపద్మహస్తలక్షణమ్.

శ్లో॥ కనిష్ఠాఽద్యావర్తితాశ్చేద్విరళాస్సోలపద్మకః॥

తా॥ చిటినకెవ్రేలు మొదలగు వ్రేళ్లు సందులుగలవిగా త్రిప్పిపట్టబడినయెడ సోలపద్మహస్తమగును.

వి॥ శ్లో॥ వికచాబ్జే కపిత్థాదిఫలేఽప్యావర్తకే కుచే। వి
రహే ముకురే పూర్ణచన్ద్రే సౌన్దర్యభాజనే।
ధమ్మిల్లచన్ద్రశాలాయాం గ్రామేఽప్యున్నతకోప
యోః। తటాకే శకటే చక్రవాకే కలకలారవే। శ్లా
ఘనే సోలపద్మశ్చ కీర్తితో భరతాగమే॥

తా॥ వికసినతామర, వెలగపండు మొదలగుపండు, తిరుగుడు, చన్ను, ఎడబాటు, అద్దము, పూర్ణచంద్రుడు, అందమయినపాత్రము, కొప్పు, మేడమీదియిల్లు, ఊరు, ఎత్తు, కోపము, చెరువు, బండి, చక్రవాకపక్షి, కలకలధ్వని, మెప్పు, వీనియందు ఈహస్తము వినియోగించునని భరతశాస్త్రమునందు చెప్పబడియున్నది.

## గ్రంథాంతరస్థసోలపద్మహస్తలక్షణమ్.

శ్లో॥ వ్యావృత్తికరణం యత్ర సభవేదలపల్లవః। వ్యావృత్తహస్తః కలశే న
వనీతముషః పురా। జజ్ఞేఽలపల్లవః కృష్ణాత్ వసన్తో ఋషిరుచ్య
తే। గన్ధర్వజాతిశ్శ్యామాంశురధీశోఽస్య దినేశ్వరః॥

తా॥ వ్రేళ్లను విరళముగ ద్రిప్పినయెడ అలపల్లవహస్తమవును. ఈయలపల్లవహస్తము పాలువెన్నలు దొంగిలించిన కృష్ణునివలన బుట్టెను, ఇది గంధర్వజాతి. దీనికి వసంతుడు ఋషి, శ్యామము వర్ణము, సూర్యుడు అధిదేవత.

వి॥ శ్లో॥ హైయంగవీనే విరహే మాలా మోదకభావనే। ఫుల్లపద్మే చ

మరహస్తమగును. ఇదిపూర్వమందుకశ్యపబ్రహ్మఅదితిదేవికికమ్మలు చేయునపుడుఆయనవలనబుట్టినది. ఇదిగంధర్వజాతి. దీనికిబుషికపిలుడు, చామనచాయ, పక్షిరాజుఅధిదేవత.

వి॥శ్లో॥ యోగేమౌనవ్రతేశృఙ్గేగజదన్తనిరూపణే।దీర్ఘనాళప్రసూనానాంగ్రహణేభ్రమరేపిచ। కర్ణమంత్రస్యరచనేకంటకోద్ధరణేపిచ। నీవీమోక్షేస్త్రీక్షురాణాంఅవ్యయానాంనిరూపణే ఖేచరేమేచకేవర్ణేభ్రమరోయంనియుజ్యతే॥

తా॥ యోగాభ్యాసము, మౌనవ్రతము, కొన, ఏనుగుదంతమునుజూపుట, నిడుకాడగలపువ్వులనుకోయుట, కర్ణమంత్రముచెప్పుట, ముల్లుతీయుట, పోకముడివిప్పుట, స్త్రీక్షురముల (రెండుక్షురముల) అవ్యయములనునిరూపించుట, ఆకాశమునందుతిరిగెడిప్రాణి, చామనిచాయ, వీనియందుఈహస్తమువినియోగించును.

౨౩. హంసాస్యహస్తలక్షణమ్.



శ్లో॥ మధ్యమాద్యాస్త్రయోంగుళ్యః ప్రసృతావిరళాయది। తర్జన్యంగుష్ఠసంయోగే హంసాస్యకరఈరితః॥

తా॥ నడిమివ్రేలుమొదలుమూడువ్రేళ్లను ఎడముగలవిగాచాచిచూపుడువ్రేలితో చేర్చిపట్టినయెడహంసాస్యహస్తమగును.

వి॥శ్లో॥ మాఙ్గళ్యసూత్రబంధేచా ఉపదేశేవినిశ్చయే।రోమాఞ్చేమౌక్తికాదౌచచిత్రసంలేఖనేతథా। దంశేతుజలబిందౌచదీపవర్తిప్రసారణే।నికషేశోధనేమల్లికాదౌరేఖావలేఖనే। మాలాయాంవహనేసోహం భావనాయాంచరూపకే।నాస్తీతివచనేచాపినికషాణాంచభావనే। కృతకృత్యేపిహంసాస్యః ఈరితోభరతాగమే॥

తా॥ బొట్టుకట్టుట, ఉపదేశము, నిశ్చయము, గగుర్పాటు, ముత్యములు మొదలైనవి, చిత్రమువ్రాయుట, అడవియీగ, నీటిబొట్టు, దీపపువత్తినెగసనద్రోయుట, ఒరయుట, శోధించుట, మల్లెమొగ్గలుమొదలైనవి, గీతగీయుట, పూలదండ, నేనేబ్రహ్మమనుట, రూపించుట, లేదనుట, ఒర

సిగ్గుపడదగినవస్తువులనుభావించుట, సిద్ధముగానున్నదనుట, వీనియందు ఈహస్తమువినియోగించును.

### గ్రంథాంతరస్థహంసాస్యహస్తలక్షణమ్.

శ్లో॥ శ్లిష్టాగ్రమధ్యమాఙ్గుష్ఠతర్జన్యోయత్ర సారితౌ।అనామికా కనీయాంసౌ సహంసాస్యకరోభవేత్। న్యగ్రోధమూలమాశ్రిత్య మునీనాంతత్త్వదర్శినామ్।హంసాస్యోదక్షిణామూర్తేరాసీదస్యఋషిశ్శుకః।శుభ్రవర్ణోమిశ్రజాతిరధీశశ్చతురాననః॥

తా॥ బొటనవ్రేలినిచూపుడునడిమివ్రేళ్ళను చేర్చి ఉంగరపువ్రేలిని చిటికెనవ్రేలినిచాచిపట్టినయెడ హంసాస్యహస్తమవును, ఇది మఱ్ఱిమానిక్రింద మునులకుజ్ఞానోపదేశము చేయునప్పుడు దక్షిణామూర్తివలన బుట్టెను. ఇది మిశ్రజాతి. దీనికి శుకుడుఋషి, వర్ణము తెలుపు, బ్రహ్మ అధిదేవత.

వి॥శ్లో॥ జ్ఞానోపదేశే పూజాయాం నిర్ణయే చతిలాఽహుతౌ।భూషణేపఠనే గానే ధ్యానే భావనిరూపణే।రచనే యావకాదీనాం పృథకే మౌక్తికే మణౌ। వేణునాదే సంయుతశ్చ ద్వ్యాసనాయాం నిజాత్మని।జలబిందౌలక్ష్యభావే మద్రికాయాం చచుమ్బనే। విప్రజాతౌ శుభ్రవర్ణే హంసాస్యః పరికీర్తితః॥

తా॥ జ్ఞానోపదేశము, పూజచేయుట, నిర్ణయించుట, తిలాహుతి, మాటలాడుట, చదువుట, పాడుట, ధ్యానము చేయుట, భావములను నిరూపించుట, లత్తుకమొదలైనవానిని పెట్టుట, గగుర్పాటు, ముత్యము, రత్నము, పిల్లనగ్రోవియూదుట, వాసనచూచుట, మనస్సు, నీటిబొట్టు, గురిపెట్టుట, ముద్దుటుంగరము, ముద్దుపెట్టుట, బ్రాహ్మణజాతి, తెల్లనవన్నె, వీనియందు ఈహస్తమువినియోగించును.

### ౨౮. హంసపక్షహస్తలక్షణమ్.



శ్లో॥ సర్పశీర్షకరేసమ్యక్కనిష్ఠా ప్రసృతా యది। హంసపక్షకరస్సోఽయం తన్నిరూపణముచ్యతే॥

తా॥ సర్పశీర్షహస్తమునందలి చిటికెనవ్రేలిని చాచిపట్టినయెడ హంసపక్షహస్తమగును.

వి॥శ్లో॥ షట్సంజ్ఞాయాం సేతుబన్ధే నఖరేఖాఙ్కనే తథా। పిధానే హంసపక్షోఽయం కీర్తితో భరతాగమే॥

తా॥ కలువపువ్వు, భోజనము చేయుట, మన్మథుడు, ముద్రలు ధరించుట బొడ్డు, అరటిపువ్వు, వీనియందు ఈహస్తము వినియోగించును.

గ్రంథాంతరస్థముకుళహస్తలక్షణమ్.

శ్లో॥ శ్లిష్టాంగుళిః పద్మకోశో యది స్యాన్ముకుళః కరః। భానుం ప్రగృహ్ణతః పూర్వం బిమ్బమేవేతిశఙ్కయా। మారుతేర్ముకుళో జాతః ఋషిస్తస్య విశాఖిలః। సఙ్కీర్ణజాతోకపిలో వర్ణశ్చంద్రోధిదేవతా॥

తా॥ పద్మకోశహస్తము యొక్క వ్రేళ్ళను చేర్చిపట్టిన యెడ ముకుళహస్తమవును. పూర్వకాలమునందు ఆంజనేయుడు దొండపండ నెడిశంక చేత సూర్యునిపట్టబోయినపుడు అతనివలన ఈముకుళహస్తము పుట్టెను. ఇది సంకీర్ణజాతి దీనికి విశాఖిలుడు ఋషి., కపిలవర్ణము, చంద్రుడు అధిదేవత.

వి-శ్లో॥ దానే జపే దీనవాక్యే భోజనే పద్మకోశకే। ఆత్మని ప్రాణనిర్దేశే వఙ్చసఙ్ఖ్యానిరూపణే। కాముకోచ్చరితే బాలచుమ్బనే దేవపూజనే। ఛత్రాదీనాంచముకుళే ఫలగ్రహనిరూపణే। సఙ్కీర్ణజాత్యాంకపిలే ముకుళః కర ఈరితః॥

తా॥ దానము, జపము, దీనమూట, భోజనము, తామరమొగ్గ, తాను ప్రాణములను నిర్దేశించుట, అయిదింటిలెక్కను చూపుట, కాముకునిమాట, బిడ్డలను ముద్దుపెట్టుకొనుట, దేవపూజ, గొడుగు మొదలగువాని యొక్క ముడుగుట, ఫలములను గ్రహించుట, సంకీర్ణజాతి, కపిలవర్ణము వీనియందు ఈహస్తము వినియోగించును.

౨౭. తామ్రచూడహస్తలక్షణమ్.



శ్లో॥ ముకుళే తామ్రచూడస్యాత్తర్జనీవక్రితా యది॥

తా॥ ముకుళహస్తమునందలి తర్జనిని వంచిపట్టిన యెడ తామ్రచూడహస్తమగును.

వి॥శ్లో॥ కుక్కుటాఽదౌ బకే కాకే ఉష్ట్రే వత్సే చ లేఖనే। తామ్రచూడకరోఽభ్యోఽసౌకీర్తితో భరతాఽగమే॥

తా॥ కోడి మొదలైనది, కొంగ, ఒంటె, దూడ, వ్రాయుట, వీనియందు ఈహస్తము వినియోగించును.

### గ్రంథాంతస్థతామ్రచూడహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకస్యకనిష్ఠాయాంయత్రాంగుష్ఠనిపీడనమ్।
తదేవతామ్రచూడాఖ్యోవదంతిభరతాదయః॥

తా॥ పతాకహస్తమునందలిచిటికెనవ్రేలినిబొట్టనవ్రేలిని కదిలించి పట్టినయెడతామ్రచూడహస్తమగును.

శ్లో॥ తేషాంమూర్తిత్రయీభావఃఋగ్యజుస్సామభిఃపురా। యేనహస్తేనాభినీతోవిధేరగ్రేయతస్తతః । తామ్రచూడోత్ర యీజాతఃతస్యవజ్రాయుధోఋషిః । శఙ్ఖవర్ణోదేవజాతిర ధిదేవోబృహస్పతిః॥

తా॥ ఇదిపూర్వకాలమునందుఆకృతులసుధరించినమూడువేదములు నుబ్రహ్మయెదుటనిలిచితమయభిప్రాయమునుతెలుపునపుడువానివలనఃబు ట్టెను. ఇదిదేవజాతి. దీనికిదేవేంద్రుడుఋషి, శంఖవర్ణము. బృహస్పతిఅ ధిదేవత.

వి॥శ్లో॥ లోకత్రయేత్రిశూలేచత్రిసఙ్ఖ్యాగణనేపిచ। అశ్రుసమ్మార్జ నేవేదత్రయేబిల్వదళేపిచ. అశ్వసమ్మార్జనేపర్ణేఫలకేచర ణాయుధే। దేవజాతౌశుభ్రవర్ణేతామ్రచూడోనియుజ్యతే॥

తా॥ మూడులోకములు, మూడు మొనలుగలశూలాయుధము, మూ డనిలెక్కపెట్టుట, కన్నీరుతుడుచుట, మూడు వేదములు, మారేడుపత్రి, గు ఱ్ఱమునుతోముట, ఆకు, పలక, కోడి, దేవజాతి, తెల్లవన్నె, వీనియందుఈహ స్తమువినియోగించును.

### ౨౮. త్రిశూలహస్తలక్షణమ్.



శ్లో॥ నికుఞ్చ్యయిత్వాఽఙ్గుష్ఠస్తుకనిష్ఠాఞ్చత్రిశూలకః।

తా॥ బొటనవ్రేలినిచిటికెనవ్రేలినివంచి తక్కినవ్రేళ్ళనుచిపట్టినదిత్రిశూలహస్తమనబడును.

వి॥శ్లో॥బిల్వపత్రేత్రిత్వయుక్తేత్రిశూలఃకరఈరితః। ఇత్యష్టావింశతిఃప్రోక్తాఅసంయుతకరాఃక్రమాత్। యావదర్థాఃప్రయోగానాంతావద్భేదాఃకరాఃస్మృతాః॥

తా॥మారేడుపత్రి, మూటికూడిక, వీనియందుఈహస్తమువినియోగించును. ఈచెప్పబడినయిరువదియెనిమిదిహస్తములును

అసంయుతహస్తములనబడును. ఈహస్తములయుపయోగార్థములు ఎన్నిగలవో అన్నిహస్తభేదములునుగలవు అని చెప్పుదురు.

ద్రంథాంతరేఽర్ణనాభహస్తలక్షణమ్.

శ్లో॥ పద్మకోశాఙ్గుళీనాం చకుఞ్చనాదూర్ణనాభకః॥ హస్తాభ్యాం
కుర్వతః పూర్వం దైత్యపక్షో విదారణమ్। నృసింహోదూర్ణనా
భశ్చ జాతశ్చాదూర్ణలకో ఋషిః। క్షత్త్రాన్వయోర క్తకాంశు
రాదికూర్మోఽధిదేవతా॥

తా॥ పద్మకోశహస్తము వ్రేళ్ళనువంచిపట్టినయెడ ఊర్ణనాభహస్తమగును. ఇది పూర్వకాలమునందు నృసింహస్వామి హిరణ్యకశిపుని రొమ్మును నఖముల చేత చీల్చునపుడు నృసింహస్వామివలన బుట్టెను. ఇది క్షత్త్రియజాతి. దీనికి శార్దూలకుడు ఋషి, రక్తవర్ణము, ఆదికూర్మము అధిదేవత.

వి॥ శ్లో॥ శిరఃకండూయనేచౌర్యే నరసింహే మృగాననే।
హర్యక్షేవానరేకూర్మే కేశ కా రేకు చేభయే।
క్షత్రజాతౌరక్తకాంశౌ ఊర్ణనాభో నియుజ్యతే॥

తా॥ తలగోకుకొనుట, దొంగతనము, నరసింహుడు, మృగముఖము, కోతి, తాబేలు, కొండగోగు, స్తనము, భయము, క్షత్త్రియజాతి, ఎఱ్ఱనైన్న సాలెపురుగు. వీనియందు ఈహస్తము చెల్లును.

ద్రంథాంతరేబాణహస్తలక్షణమ్.

శ్లో॥ తర్జన్యాద్యాస్త్రయస్త్విష్టాః కిఞ్చ పఙ్గుష్ఠపీడితాః।
కనిష్ఠికా చ ప్రసృతా సబాణః కథితః కరః॥
షట్సఙ్ఖ్యాయాం నాళనృత్యే బాణహస్తో నియుజ్యతే॥

తా॥ చూపుడువ్రేలు మొదలు మూడువ్రేళ్ళను చేర్చి బొటనవ్రేలిని కొంచెము సోకునట్టు చిటికెనవ్రేలిని చాచిపట్టినయెడ బాణహస్తమగును. ఇది ఆరు అని లెక్కపెట్టుటయందును నాళనృత్యమునందును వినియోగించును.

ద్రంథాంతరేఽర్థసూచికహస్తలక్షణమ్.

శ్లో॥ కపిత్థతర్జనీ చోర్ధ్వాసారణాదర్థసూచికః।
అఙ్కురే పక్షిశాబాదౌ బృహత్కేటే నియుజ్యతే॥

తా॥ కపిత్థహస్తపు చూపుడువ్రేలు పొడువుగా ఎత్తిపట్టబడినయెడ అర్థసూచికహస్తమగును. ఇది మొలక, పక్షిపిల్ల మొదలగునది, పెద్దపురుగు. వీనియందు వినియోగించును.

అథచతుర్వింశతిసంయుతహస్తానిరూప్యంతే.

శ్లో॥ అంజలిశ్చకపోతశ్చకర్కటస్స్వస్తిక స్తథా। డోలాహస్తఃపుష్పపుటశ్చోత్సంగశ్శివలిఙ్గకః। కటకావర్ధనశ్చైవకర్తరీస్వస్తికాభిధః। శకటశ్శఙ్ఖచక్రౌ చసమ్పుటపాశకీలకౌ। మత్స్యకూర్మవరాహాశ్చ గరుడోనాగబన్ధకః। ఖట్వాభేరుణ్డకాఖ్యశ్చ అవహిత్థస్తథైవచ। చతుర్వింశతిసంఖ్యాకాస్సంయుతాఃకథితాఃకరాః॥

తా॥ అంజలి,కపోలము,కర్కటము, స్వస్తికము,డోల,పుష్పపుటము, ఉత్సఙ్గము, శివలింగము,కటకావర్ధనము,కర్తరీస్వస్తికము, శకటము, శంఖము,చక్రము,సంపుటము,పాశము,కీలకము,మత్స్యము, కూర్మము,వరాహము,గరుడము,నాగబంధము,ఖట్వ,భేరుండము,అవహిత్థము, అనునీ యిరువదినాలుగుహస్తములు సంయుతహస్తములని భరతశాస్త్రమునందు చెప్పబడియున్నది.

గ్రంథాంతరే.

శ్లో॥ అసంయుతానాంసంయోగాస్సంయుతాఖ్యాభవంతితే।
తేషాముత్పత్తిరేవైషాయోజనీయతమాబుధైః।
తథాపిక్వచ్చిద్వతాభేదాదధిదేవఃపృథక్పృథక్॥

తా॥ రెండుఅసంయుతహస్తములనుచేర్చిపట్టునెడసంయుతహస్తమగును.ఆసంయుతహస్తములకుఉత్పత్తిజాతిఋషిమొదలగునవిఒకటిగానే యుండిననుఅధిదేవతలుమాత్రముభేదపడియుండును.

౧,అంజలిహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకతలయోర్యోగాదంజలిఃకరఈరితః॥

తా॥ రెండుపతాకహస్తములనుఅరచేతిలోజేర్చిన నదియంజలిహస్తమనబడును.

వి॥శ్లో॥ దేవతాగురువిప్రాణాంనమస్కారేప్యనుక్రమాత్।
కార్యశ్శిరోముఖోరస్సువినియోజ్యోఽంజలిఃకరః॥

తా॥ దేవతలకును,గురువులకును,బ్రాహ్మణులకును,నమస్కారముచేయుటయందుఈహస్తముచెల్లును. అందు దేవతలకుమ్రొక్కునపుడు, శిరస్సునందును,గురువులకుమ్రొక్కునపుడుముఖమునందును, బ్రాహ్మణులకుమ్రొక్కునపుడురొమ్మునందునుక్రమముగానొప్పును.

### గ్రంథాంతరస్థఅంజలిహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకహస్తతలయోస్సంశ్లేషో యత్ర జాయతే।
తమాహురంజలిహస్తః క్షేత్రపాలోఽధిదేవతా॥

తా॥ రెండుపతాకహస్తముల అరచేతులు చేర్చిపట్టబడునెడ అంజలిహస్తమవును. దీనికి అధిదేవత క్షేత్రపాలుడు.

వి॥శ్లో॥ ప్రణామే వినయే తాలఘాతే శమ్భునిరూపణే।
కిం కరోమీతి వదనే ధ్యానే చాంజలిరుచ్యతే।

తా॥ నమస్కరించుట, వినయముతో వంగుట, తాళము వేయుట, శివస్వరూపమును నిరూపించుట, ఏమి చేయుదునని యనుట, ధ్యానము చేయుట, వీనియందు ఈహస్తము చెల్లును.

### కపోతహస్తలక్షణమ్.

శ్లో॥ కపోతస్సకరో జ్ఞేయశ్శ్లిష్టమూలాఽగ్రపార్శ్వతః॥

తా॥ ముందుచెప్పిన అంజలిహస్తము మొదలు తుదలు పార్శ్వభాగములు చేరియుండపట్టబడిన యెడ కపోతహస్తమగును.

వి॥శ్లో॥ ప్రమాణగురుసమ్భాషా వినయాఽఙ్గీకృతిష్వయమ్॥

తా॥ ప్రమాణము, పెద్దలతో మాటలాడుట, వినయముతో నొప్పుకొనుట, వీనియందు ఈహస్తము వినియోగించును.

### గ్రంథాంతరస్థకపోతహస్తలక్షణమ్.

శ్లో॥ అంజలేరంతరం యత్ర జాయతే విరళీకృతే।
స భవేత్ కపోతాఖ్యశ్చిత్రసేనోఽధిదేవతా॥

తా॥ అంజలిహస్తము ఎడమయిన వ్రేళ్లుగలదిగా పట్టబడినయెడ కపోతహస్తమవును. దీనికి అధిదేవత చిత్రసేనుడు.

వి॥శ్లో॥ అంగీకారే నారికేళపూగానాం పాదపాదిషు । కదళీకుసుమే శీతే వినతే వస్తుసంగ్రహే । సమ్పుటే మాతులుంగే చ కపోతో వినియుజ్యతే॥

తా॥ అంగీకారము, టెంకాయ, పోక, ఆవృక్షములు మొదలగునది, అరటిపూవు, చలి, అమృతము, వస్తువులను సంగ్రహించుట సంపుటము, మాదిఫలము, వీనియందు ఈహస్తము వినియోగపడును.

### ౩, కర్కటహస్తలక్షణమ్.

శ్లో॥ అన్యోఽన్యస్యాఽన్తరేయఽత్రాఙ్గుళ్యోనిసృతహస్తయోః।
అంతర్బహిర్వావర్తన్తేకర్కటస్సోఽభిధీయతే॥

తా॥ముందుచెప్పినకపోతహస్తమందు వ్రేలివ్రేలినందునను వ్రేళ్ళుచొప్పించివెలికికూనిలోపలికిగానిచాచినట్టబడునెడలకర్కటహస్తమగును.

వి॥శ్లో॥ సమూహదర్శనేతుందదర్శనేశఙ్ఖపూరణే। అఙ్గానాంమోటనేశాఖోన్నమనేచనియుజ్యతే॥

తా॥ గుంపునుచూపుట, లావైనదానినిచూపుట, శంఖనాదముచేయుట, దేహాలస్యముపోగొట్టుకొనుట, చెట్టుకొమ్మనువంచుట, వీనియందుఈహస్తముపయోగించును.

### గ్రంథాంతరస్థకర్కటహస్తలక్షణమ్.

శ్లో॥ ఈర్ణనాభాంగుళీరత్ర సంశ్లిష్టాఃకర్కటోఽభవేత్।
అస్యాధిదైవతం విష్ణుమాదిదేవంవిదుర్బుధాః॥

తా॥ ఊర్ణనాభహస్తముయొక్క వ్రేళ్ళసందులందు రెండవచేతివ్రేళ్లనుచొప్పించిపట్టినయెడకర్కటహస్తమగును.దీనికివిష్ణువుఅధిదేవత.

వి॥శ్లో॥ విలాపేజృమ్భణే పూతేకర్కటేశంఖపూరణే।
అంగుళీమోటనేస్త్రీణాంకర్కటేవినియుజ్యతే॥

తా॥ దుఃఖవచనములాడుట, ఆవులింత, కొట్టుట, ఎండ్రకాయ, శంఖమునుఊదుట, స్త్రీలుమెటికెలువిరుచుట, వీనియందుఈహస్తము వినియోగించును.

### ౪, స్వస్తికహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకయోస్సన్నియుక్తః కరయోర్మణిబన్ధయోః। సంయోగేనస్వస్తికాఖ్యోమకరార్థేనియుజ్యతే। భయవాదేవివాదేచ కీర్తనేస్వస్తికోభవేత్॥

తా॥ రెండుపతాకహస్తములందలి మణికట్టులనుజేర్చిపట్టినయెడస్వస్తికహస్తమగును. ఇది మొసలినితెలుపుట, భయముతోమాటలాడుట, పొగడుట, వాదాడుట, వీనియందుఉపయోగించును.

### ౫,డోలాహస్తలక్షణమ్.

శ్లో॥ పతాక్యేపూరుదేశస్థేడోలాహస్తోఽయముచ్యతే।
నాట్యారమ్భేప్రయోక్తవ్యమితినాట్యవిదోవిదుః॥

తా॥ రెండుపతాకహస్తములను తొడమీఁదికిఁ వ్రేలునట్లు పట్టినయెడ డోలాహస్తము అగును. ఇదినాట్యారంభమందు వినియోగింపదగినదని నాట్యశాస్త్రజ్ఞులుచెప్పుదురు.

గ్రంథాంతరస్థడోలాహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకౌపార్శ్వగౌడోలా భారతీతస్యదేవతా।
మోహామూర్ఛామదాలస్యవిలాసాదిషుకీర్తితః॥

తా॥ పతాహస్తములు ఇరుపార్శ్వములందు వ్రేలునట్లుపట్టబడినయెడడోలాహస్తమగును, దీనికి దేవతసరస్వతి, ఇదిమోహము, మూర్ఛ, మదము, ఆలస్యము, విలాసము మొదలగువానియందు వినియోగించును.

౬, పుష్పపుటహస్తలక్షణమ్.

శ్లో॥ సంశ్లిష్టకరణౌసర్పశీర్షే పుష్పపుటఃకరః॥

తా॥ రెండుసర్పశీర్షహస్తములయొక్క మనికట్టు మొదళ్లుచిటికెనవ్రేలివరకుగల అరచేతివెలుపలిభాగములను జేర్చిపట్టినయెడ పుష్పపుటహస్తమగును.

వి॥శ్లో॥ నీరాజనవిధౌబాలఫలాఽదిగ్రహణేతథా ।
సంధ్యాయామర్ఘ్యదానేచమంత్రపుష్పేనియోజయేత్॥

తా॥ కర్పూరహారతి, బిడ్డలుపండ్లుమొదలైనవానినిదీసికొనుట, సంధ్యాకాలమందు అర్ఘ్యప్రదానముచేయుట, మంత్రపుష్పమిచ్చుట, వీనియందుఈహస్తముపయోగించును.

గ్రంథాంతరస్థపుష్పపుటహస్తలక్షణమ్.

శ్లో॥ సర్పశీర్షస్యపార్శ్వేతు అపరఃసర్పశీర్షకః ।
ధృతఃపుష్పపుటాఖ్యస్స్యాదధీశఃకిన్నరేశ్వరః॥

తా॥ సర్పశీర్షహస్తముయొక్క పార్శ్వమందు రెండు రెండవచేతి సర్పశీర్షమును జేర్చిపట్టినయెడ పుష్పపుటహస్తమగును. దీనికికిన్నరేశ్వరుడు అధిదేవ.

వి॥శ్లో॥ సుమధాన్యఫలాదీనా మర్పణేగ్రహణేతథా ।
అర్ఘ్యదానేపుష్పపుటఃకీర్తితోభావకోవిదైః॥

తా॥ పుష్పలుధ్యానముపండ్లు మొదలయినవానినిఇచ్చి పుచ్చుకొనుటలయందును, అర్ఘ్యప్రదానమునందును ఈహస్తమువినియోగించును.

## ౭, ఉత్సంగ హస్తలక్షణమ్.

శ్లో॥ అన్యోన్యబాహుమూలస్థౌ మృగశీర్షౌ కరౌ యది।
ఉత్సఙ్గనామాహస్తోఽయంకీర్తితో భరతాఽగమే॥

తా॥ రెండుమృగశీర్షహస్తములనుమూపులు సోకపట్టునెడఉత్సంగహస్తమగును.

వి॥శ్లో॥ ఆలిఙ్గనేచలజ్జాయామఙ్గనాఽద్రిప్రదర్శనే।
బాలానాంశిక్షణేచాఽయముత్సంగోయుజ్యతేకరః॥

తా॥ కౌగిలింత, సిగ్గు, భుజకీర్తులు మొదలగువానిజూపుట, బాలురనుశిక్షించుటవీనియందు ఈహస్తముపయోగించును.

## గ్రంథాంతరస్థోత్సఙ్గహస్తలక్షణమ్.

శ్లో॥ అరాళౌస్వస్తికస్కంధావుత్సఙ్గస్తదధీశ్వరః। గౌతమోవినియోగస్తులజ్జాయాంపరిరమ్భణే। అఙ్గీకారేచశీతేచసాధ్వసార్థే కుచగోపనే। ఏవమాదిషుయుంజంతేఉత్సంగకరభావనాః॥

తా॥ అరాళహస్తములనుమూపులందుజేర్చిపట్టునెడఉత్సంగహస్తమగును. దీనికిఅధిదేవతగౌతముడు. ఇదిసిగ్గు, కౌగిలింత, అంగీకారము, చలి, మేలనుట, చన్నులనుకప్పుట, మొదలగువానియందు వినియోగించును.

## ౮. శివలింగహస్తలక్షణమ్.

శ్లో॥ వామేఽర్ధచంద్రేవిన్యస్తోశిఖరశ్శివలింగకః।
వినియోగస్తుతస్యైవశివలింగప్రదర్శనే॥

తా॥ ఎడమచేతియర్ధచంద్రహస్తమందుశిఖరహస్తముంచబడెనేని శివలింగహస్తమగును. ఇదిశివలింగమునుజూపుటయందువినియోగించును.

## ౯. కటకావర్ధనహస్తలక్షణమ్.

శ్లో॥ కటకాముఖయోఃపాణ్యోస్స్వస్తికాన్మణిబంధయోః।
కటకావర్ధనాఽఖ్యస్స్యాదితినాట్యవిదోవిదుః॥

తా॥ కటకాముఖహస్తములయొక్కమనికట్లుస్వస్తికముగాజేర్చిపట్టబడునేని కటకావర్ధనహస్తమగును.

వి॥శ్లో॥ పట్టాభిషేకేపూజాయాం వివాహాఽశిషియుజ్యతే॥

తా॥ పట్టాభిషేకము, పూజ, పెండ్లిదీవన, వీనియందు ఈహస్తమువినియోగించును.

గ్రన్థాంతరస్థకలకావర్ధన హస్తలక్షణమ్.

శ్లో॥ కటకావర్ధనాఖ్యస్స్యాత్స్వస్తికౌకటకాముఖౌ।
తస్యదేవోయక్షరాజోభావజ్ఞైశ్చనిరూపితః॥

తా॥ కటకాముఖహస్తములను స్వస్తికములుగబట్టినయెడ కటకావర్ధనహస్తమగును.

వి॥శ్లో॥ వినియోగేవిచారేచ శృఙ్గారేకోపసాంత్వనే।
జక్కిణీనటనేదండలాస్యేభవతినిశ్చయే॥

తా॥ విచారము, శృంగారము, కోపసమాధానము, జక్కిణిఅనుఆట, కోలాటము, నిశ్చయమువీనియందు ఈహస్తము వినియోగించును.

౧౦, కర్తరీస్వస్తిక హస్తలక్షణమ్.

శ్లో॥ కర్తరీస్వస్తికాఽకారో కర్తరీస్వస్తికోభవేత్॥

తా॥ కర్తరీముఖహస్తములను స్వస్తికాకారముబట్టినయెడ కర్తరీస్వస్తికహస్తమగును.

వి॥శ్లో॥ శాఖాసుచాఽద్రిశిఖరే వృక్షేషుచ నియుజ్యతే॥

తా॥ చెట్టుకొమ్మలు, పర్వతశిరఖరము, వృక్షములు వీనియందు ఈహస్తముఉపయోగించును.

౧౧, శకటహస్తలక్షణమ్.

శ్లో॥ భ్రమరామధ్యమాఙ్గుష్ఠప్రసారాచ్ఛకటోభవేత్।
రాక్షసాఽభినయేచాఽయంనియోజ్యోభరతాదిభిః॥

తా॥ భ్రమరహస్తములురెండును బొటనవ్రేలినినడిమివ్రేలినిచాచి పట్టబడునేని శకటహస్తమగును. ఇదిరాక్షసులు మొదలయినవారలయభినయమునందు చెల్లును.

౧౨, శంఖహస్తలక్షణమ్.

శ్లో॥ శిఖరాఽన్తర్గతాఽఙ్గుష్ఠ ఇతరాఙ్గుష్ఠసంగతః। తర్జన్యాద్యాయతాశ్లిష్టాశ్శంఖహస్తఃప్రకీర్తితః। శంఖాదిషునియోజ్యోఽయమిత్యేవం భరతాఽశయః॥

తా॥ శిఖరహస్తములోపలియంగుష్ఠముతో రెండవచేతియంగుష్ఠమును జేర్చితక్కినవ్రేళ్ళను ఆశిఖరహస్తములపైకి చాచిపట్టినయెడ శంఖహస్తమగును. ఇదిశంఖము మొదలైనవానియందు వినియోగించును.

౧౩, చక్రహస్తలక్షణమ్.

శ్లో॥ యత్రాఽర్ధచంద్రౌ తిర్యఞ్చౌ వన్యోన్యతలసంస్పృశౌ।
చక్రహస్తస్స విజ్ఞేయశ్చక్రార్థే వినియుజ్యతే॥

తా॥ అర్ధచంద్రహస్తమును అడ్డముగా రెండు అరచేతులను జేర్చిపట్టి
నయెడ చక్రహస్తమగును. ఇది చక్రార్థమందు చెల్లును.

౧౪, సమ్పుటహస్తలక్షణమ్.

శ్లో॥ కుఞ్చితాఽఙ్గుళయశ్చక్రే సమ్పుటః కర ఈరితః॥

తా॥ ముందు చెప్పిన చక్రహస్తము వ్రేళ్ళను ముడిచిపట్టినయెడ సం
పుటహస్తమగును.

వి॥శ్లో॥ వస్త్వాచ్ఛాదే సమ్పుటే చ సమ్పుటః కర ఈరితః॥

తా॥ వస్తువులను దాచుటయందును ముడుపబడిన దానియందును ఈ
హస్తము చెల్లును.

౧౫, పాశహస్తలక్షణమ్.

శ్లో॥ సూచ్యానికుఞ్చితే శ్లిష్టే తర్జన్యా పాశ ఈరితః॥

తా॥ సూచీహస్తముల చూపుడు వ్రేళ్ళను వంచి చేర్చిపట్టినయెడ పా
శహస్తమగును.

వి-శ్లో॥ అన్యోన్యకలహే పాశే శృంఖలాయాం నియుజ్యతే॥

తా॥ పరస్పరకలహమునందును, త్రాటియందును, సంకెలయందు
ను, ఈ హస్తము చెల్లును.

౧౬, కీలకహస్తలక్షణమ్.

శ్లో॥ కలిష్ఠే కుఞ్చితే శ్లిష్టే మృగశీర్షే తు కీలకః॥

తా॥ మృగశీర్షహస్తముల చిటికెనవ్రేళ్ళను వంచి చేర్చిపట్టినయెడ కీ
లకహస్తమగును.

వి॥శ్లో॥ స్నేహే చ నర్మాఽలాపే చ వినియోగోఽస్య సమ్మితః॥

తా॥ స్నేహమునందును, ప్రియవచనమునందును హస్తము చెల్లును.

౧౭, మత్స్యహస్తలక్షణమ్.

శ్లో॥ కరపృష్ఠోపరిన్యస్తో యత్ర హస్తస్త్వధోముఖః। కిఞ్చిత్ప్రసా
రితాఽఙ్గుష్ఠకనిష్ఠో మత్స్యనామకః। ఏతస్యాపి వియోగస్తు మ
త్స్యార్థే సమ్మతో భవేత్॥

తా॥ పతాకహస్తములు ఒకటిమీఁదనొకటిచేర్చి చిటికెనవ్రేళ్ళనుబొటనవ్రేళ్ళను కొంచెముచాచిపట్టినయెడ మత్స్యహస్తమగును. ఇదిమత్స్యార్థమునందు చెల్లును.

౧౮, కూర్మహస్తలక్షణమ్.

శ్లో॥ కుఞ్చితాఽగ్రాంగుళిశ్చక్రేత్యక్తాఽంగుష్ఠకనిష్ఠకః।
కూర్మహస్తస్సవిజ్ఞేయఃకూర్మాఽర్థే వినియుజ్యతే॥

తా॥ చక్రహస్తము మొనవ్రేళ్ళనువంచి చిటికెనవ్రేలిని బొటనవ్రేలిని జాచిపట్టినయెడకూర్మహస్తమగును ఇదితాబేటియొక్క అర్థమునందు ఉపయోగించును.

౧౯, వరాహహస్తలక్షణమ్.

శ్లో॥ మృగశీర్షేతదన్యకరస్తేవశ్లిష్టస్థితోయది । కనిష్ఠాఽంగుష్ఠయోర్యోగా ద్వరాహఃకరఈరితః । ఏతస్యవినియోగస్తువరాహార్థేతుయుజ్యతే॥

తా॥ మృగశీర్షహస్తమును ఒకటిమీఁదనొకటిచేర్చి చిటికెనబొటనవ్రేళ్ళనుకూడబట్టబడినయెడ వరాహహస్తమగును, ఇదిపందియొక్క అర్థమందువినియోగించును.

౨౦, గరుడహస్తలక్షణమ్.

శ్లో॥ తిర్యక్తలస్థితావర్ధ చన్ద్రావంగుష్ఠయోగతః । గరుడోగరుడార్థేచ యుజ్యతేభరతాగమే॥

తా॥ అర్ధచంద్రహస్తములురెండును అడ్డముగాబొటనవ్రేళ్ళచేరికతోపట్టబడినయెడ గరుడహస్తమగును. ఇదిగరుడుని అర్థమందుఉపయోగించును.

౨౧, నాగబన్ధహస్తలక్షణమ్.

శ్లో॥ సర్పశీర్షౌస్వస్తికాచేన్నాగబంధఇతీరితః॥

తా॥ రెండుసర్పశీర్షహస్తములు మనికట్టులుచేర్చిపట్టబడినయెడ నాగబంధహస్తమగును.

వి॥శ్లో॥ ఏతస్యవినియోగస్తునాగబంధేనియుజ్యతే ।
భుజంగదమ్పతీభావే నికుఞ్జానాంచదర్శనే ।
అథర్వణస్యమంత్రేషుయోజ్యోభరతకోవిదైః॥

తా॥ పాముల పెనవంటిరతిబంధమందును, పాముల పెనయందును, పొదరిండ్లను జూపుటయందును, అథర్వణమంత్రమునందు-ఈహస్తము చెల్లును.

౨౨, ఖట్వాహస్తలక్షణమ్.

శ్లో॥ చతురేచతురంన్యస్యతర్జన్యఙ్గుష్ఠమోక్షతః ।
ఖట్వాహస్తోభవేదేషఃఖట్వాఽదిష్వనియుజ్యతే॥

తా॥ చతురహస్తముపై చతురహస్తమునుంచి చూపుడువ్రేలినిబొటనవ్రేలినిచాచిపట్టినయెడ ఖట్వాహస్తమగును. ఇది, మంచము మొదలైనవానియందుడుపయోగించును.

౨౩, భేరుండహస్తలక్షణమ్.

శ్లో॥ మణిబన్ధకపిత్థాభ్యాం భేరుండకరఇష్యతే ।
భేరుండపక్షిదమ్పత్యోర్భేరుండకర-ఈరితః ॥

తా॥ కపిత్థహస్తములు రెండుమణికట్టులతోను జేర్చిపట్టబడినయెడ భేరుండహస్తమగును. ఇదిభేరుండపక్షిదంపతులయందువినియోగించును.

౨౪, అవహిత్థహస్తలక్షణమ్.

శ్లో॥ అలపద్మావక్షస్థౌఅవహిత్థకరోమతః॥

తా॥ రెండుఅలపద్మహస్తములు ఱొమ్మునకెదురుగాబట్టబడినయెడ అవహిత్థహస్తమగును.

వి॥శ్లో॥ శృఙ్గారనటనేహస్తో లీలాకందుకధారణే।
కుచార్థేయుజ్యతేసోఽయమవహిత్థకరాఽభిధః॥

తా॥ శృంగారనటనము, పుట్టచెండునుపట్టుట, స్తనముయొక్క-అర్థము వీనియందు-ఈహస్తము వినియోగించును.

శ్లో॥ ఏవంసంయుతహస్తానాం నామలక్షణమీరితమ్॥

తా॥ ఈవిధముగా సంయుతహస్తములయొక్క నామలక్షణములు చెప్పబడియెను.

గ్రన్థాన్తరస్థావహిత్థహస్తలక్షణమ్.

శ్లో॥ హృదయాభిముఖౌయత్రశుకతుణ్డావధోగతౌ ।
సోఽవహిత్థోభవేదస్య మార్కణ్డేయోఽధిదేవతా॥

తా॥ శుకతుండహస్తములుక్రిందినుండి హృదయాభిముఖములుగబట్టబడినయెడఅవహిత్థహస్తమగును. దీనికిఅధిదేవతమార్కండేయుడు.

వి॥శ్లో॥ దుర్బలత్వే దేహకార్శ్యే కౌతుకేచకృశేమతః॥

తా॥ బలహీనత, దేహముచిక్కియుండుట, సంతోషము, చిక్కిన వీనియందు ఈహస్తము చెల్లును.

గ్రన్థాన్తరస్థగజదన్తహస్తలక్షణమ్.

శ్లో॥ బాహుమధ్యగతౌ సర్పశీర్షౌ స్వస్తికతాంగతౌ ।
యదిస్యాద్గజదంతోయంపరమాత్మాధిదేవతా॥

తా॥ సర్పశీర్షహస్తములు బాహుమధ్యమందు జేర్పబడినయెడ గజదంతహస్తమగును. దీనికిఅధిదేవతపరమాత్మ.

వి॥శ్లో॥ స్తమ్భగ్రహేశిలోత్పాటే భారగ్రాహేనియుజ్యతే॥

తా॥ సర్పశీర్షహస్తములు బాహుమధ్యమందు జేర్పబడినయెడ గజదంతహస్తమగును. దీనికిఅధిదేవతపరమాత్మ.

వి॥శ్లో॥ స్తమ్భగ్రహేశిలోత్పాటే భారగ్రాహేనియుజ్యతే॥

తా॥ స్తంభమును గ్రహించుటయందును, రాతినిపెల్లగించుటయందును, భారమునువహించుటయందును ఈహస్తముచెల్లును.

గ్రన్థాన్తరస్థచతురశ్రహస్తలక్షణమ్.

శ్లో॥ చతురశ్రస్సన్నతోవక్షః పురోగాకటకాముఖౌ ।
తస్యాధిదైవంవారాహీ కీర్తితోభావకోవిదైః ॥

తా॥ రొమ్మునకెదురుగ కటకాముఖహస్తములను బట్టినయెడచతురశ్రహస్తమగును. దీనికిఅధిదేవతవారాహీ॥

వి॥శ్లో॥ నియోగోదధిమన్థానే జక్కిణీనటనేపిచ । ధారణేదోహనవిధౌపటానామవకుంఠనే । వహనేమాక్తికాదీనాం రజ్జ్వాదీనాఞ్చకర్షణే । నివీబంధేచోళబంధే సుమాదీనాఞ్చధారణే । వీజనేచామరాదీనాం చతురశ్రోనియుజ్యతే॥

తా॥ పెరుగుచిలుకుట, జక్కిణియనుఆట, ధరించుట, పాలుపిదుకుట, వస్త్రములను కప్పుకొనుట, ముత్యములు మొదలగువానిని ధరించుట, త్రాడు మొదలగువానిని ఈడ్చుట, పోకముడి, రవికముడి, పువ్వులు మొదలగువానిని ధరించుట, వింజామరము మొదలగువానిని వీచుట వీనియందు ఈహస్తమువినియోగించును.

గ్రంథాంతరస్థతలముఖహస్తలక్షణమ్.

శ్లో॥ వక్షఃపురస్థాదుద్వృత్తౌ కరౌత్వముఖౌయది ।
నామ్నాతలముఖస్తస్యవిఘ్నరాజోధిదేవతా॥

తా॥ రొమ్మున కెదురుగ పతాకహస్తములనుమీఁదికెత్తిపట్టినయెడ తలముఖహస్తమగును. దీనికిఅధిదేవత విఘ్నేశ్వరుడు.

వి॥శ్లో॥ ఆలిఙ్గనేస్థూలవస్తౌ మహాస్తమ్భాదిభావనే ।
బుధైరభిహితో మఞ్జుమర్దళే మధురస్వనే॥

తా॥ ఆలింగనము, పెద్దవస్తువు, లావైన స్తంభములనుజూపుట, మనోజ్ఞమయినధ్వనిగలమద్దెల, వీనియందు ఈహస్తముచెల్లును.

౧౩, స్వస్తికాహస్తలక్షణమ్.

శ్లో॥ త్రిపతాకౌవామభాగా యదిస్వస్తికతాంగతౌ ।
సభవేత్స్వస్తికాహస్తోగుహస్తస్యాధిదేవతా ॥

తా॥ త్రిపతాకములుఎడమతట్టు స్వస్తికాకారముగాబట్టబడినయెడ స్వస్తికహస్తమగును. దీనికిఅధిదేవతగుహుడు.

వి॥శ్లో॥ కల్పద్రుమేషుశైలేషు హస్తోయంవినియుజ్యతే॥

తా॥ కల్పవృక్షములయందును పర్వతములయందును ఇదివినియోగించును.

౧౪, ఆవిద్ధవక్ర హస్తలక్షణమ్.

శ్లో॥ వ్యావృత్తహస్తౌసఙ్ఘాతౌ సవిలాసంసకూర్పరమ్।
పతాకావిద్ధవక్రస్స్యాత్తుమ్బురుస్త్వధిదేవతా॥

తా॥ రెండుపతాకహస్తముల మోచేతులను విలాసముతోగూడుకొనునట్లువిరివిగాబట్టినయెడ ఆవిద్ధవక్రహస్తమగును. దీనికిఅధిదేవత తుంబురుడు.

వి॥శ్లో॥ మేఖలావహనేభేదే మధ్యకార్శ్యనిరూపణే ।
దేశీయనాట్యనటనేవినియోగస్తయోర్విదుః ॥

తా॥ మొలనూలుధరియించుట, భేదము, నడుముయొక్కసన్నదనమును తెలుపుట, దేశీయనాట్యమువీనియందు ఈహస్తముచెల్లును,

౧౫, రేచితహస్తలక్షణమ్.

శ్లో॥ హంసపక్షౌకృతోత్తాన తలావగ్రధృతౌయది ।
రేచితస్యకరోజ్ఞేయో యక్షరాడధిదేవతా ॥

తా॥ రెండుహంసపక్షహస్తములను అరచేయిమీఁదు చేసిపట్టినయెడ రేచితహస్తమగును.

వి-శ్లో॥ శిశూనాంధారణేచిత్ర ఫలకస్యనిరూపణే।
వినియోగో రేచితస్యఏవమాదిషుయుజ్యతే ॥

తా॥ బిడ్డలనుఎత్తుకొనుట. చిత్తరుపలకనుచూపుట, మొదలగువానియందు-ఈహస్తముచెల్లును.

౧౬, నితమ్బహస్తలక్షణమ్.

శ్లో॥ ఉత్తానితావధోవక్రాపతాకావంసదేశతః ।
నితమ్బస్థానితమ్బాభ్యోఽగస్త్యస్త్వస్యదేవతా॥

తా॥ రెండుపతాకహస్తములను మూపులుమొదలుకొని క్రిందుముగముగా పిరుదులుతాకునట్లు పట్టినయెడనితంబహస్తమగును. దీనికిఁధిదేవతఅగస్త్యుడు.

వి॥శ్లో॥ శ్రమేవతరణేచైవ విస్మయేవివశాయితే ।
ఏవమాదిషుయుజ్యేత నితమ్బాఖ్యకరఃస్మృతః॥

తా॥ బడిలిక, దిగుట, ఆశ్చర్యము, పరవశత్వము, మొదలగువానియందు ఈహస్తముచెల్లును.

౧౭, లతాహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకాడోలికాకారౌలతాఖ్యశ్శక్తిదేవతా॥

తా॥ రెండుపతాకహస్తములను డోలాకారముగ బట్టినయెడలతాహస్తమవును, దీనికిఅధిదేవతశక్తి.

వి॥శ్లో॥ ఏతస్యవినియోగశ్చ నిశ్చేష్టాయాంమదాలసే । స్వభావనటనారమ్భే రేఖాయాంయోగభావనే । ఏవమాదిషుయుజ్యేత లతాహస్తవిభావనా॥

తా॥ చేష్టలులేకయుండుట, మదాలస్యము, స్వభావనటనము, రేఖయోగభావనము, మొదలైనవానియందు ఈహస్తముచెల్లును.

౧౮, పక్షవఞ్చితహస్తలక్షణమ్.

శ్లో॥ విన్యస్యాగ్రేకటీశీర్షే త్రిపతాకకరౌయది ।
పక్షవఞ్చితనామాసౌఅనయోర్దేవతార్జునః॥

తా॥ రెండుత్రిపతాకహస్తములను ముందుగానడుముమీదికి ఎగబనయెడ పక్షవంచితహస్తమగు, దీనికిఅధిదేవతఅర్జునుడు.

వి॥శ్లో॥ ఊర్వోరభినయేభేదేవినియోగోనియుజ్యతే॥

తా॥ తొడలయభినయమందును భేదమందును-ఈహస్తముచెల్లును.

౧౯, పక్షప్రద్యోతహస్తలక్షణమ్.

శ్లో॥ ఉత్తానితానిమౌపక్షప్రద్యోతౌసిద్ధదేవతా॥

తా॥ ఈపక్షవంచితహస్తము మరికొంచెము ఎగబట్టబడినయెడ ప్రద్యోతహస్తమవును. దీనికిసిద్ధుడు అధిదేవత.

వి॥శ్లో॥ నిరుత్సాహేబుద్ధిజాడ్యే విపరీతవిరూపణే ।
మాయావరాహే కుండన్యభినేయోభవేదసౌ॥

తా॥ ఉత్సాహములేమి, బుద్ధిమాంద్యము, విపరీతమునునిరూపించుట,మాయావరాహము,కుండాభినయము,వీనియందు-ఈహస్తముచెల్లును,

౨౦, గరుడపక్షహస్తలక్షణమ్.

శ్లో॥ అర్ధచంద్రౌకటీపార్శ్వేన్యస్తోర్ధ్వస్ఫారితాయది।
స్యాతాంగరుడపక్షాఖ్యౌ తయోరీశస్సనన్దనః ॥

తా॥ రెండుఅర్ధచంద్రహస్తములు పిరుదులప్రక్కలను ఎగబట్టిబడినయెడగరుడపక్షహస్తమగును, దీనికిఅధిదేవతసనందనుడు,

వి॥శ్లో॥ కటిసూత్రేధికేచైవ ఏవమాదిషుయుజ్యతే॥

తా॥మొలనూలు,అధికము మొదలైనవానియందు-ఈహస్తముచెల్లును.

౨౧, నిషేధహస్తలక్షణమ్.

శ్లో॥ కపిత్థాఖ్యేనహస్తేనవేష్టితో ముకుళోయది ।
నిషేధోనామచథవేత్తుమ్బురుస్త్వధిదేవతా॥

తా॥ గపిత్థహస్తముచేత ముకుళహస్తముబట్టబడినపయెడ నిషేధహస్తమౌను, దీనికిఅధిదేవతతుంబురుడు.

వి॥శ్లో॥ సిద్ధాన్తస్థాపనేసత్యే నూనమిత్యవిభాషణే । చూచుకగ్రహణే అఙ్గపూజాయాం వినియుజ్యతే॥

తా॥ సిద్ధాంతస్థాపనము, నిజము, నిశ్చయముచేయుట, చనుమొనలనుఅంటుట, అంగపూజా, వీనియందుఇదివినియోగించును.

౨౨, మకరహస్తలక్షణమ్.

శ్లో॥ యత్రాన్యోన్యంపరిగతా నర్ధచంద్రావధోముఖౌ ।
చలాఙ్గుష్ఠేవ మకేరోమహేంద్రస్తస్యదేవతా॥

తా॥ రెండుఅర్ధచంద్రహస్తములనుజేర్చి దిగుమొగముగా బొటనవ్రేళ్ళనుకదలించిపట్టినయెడమకరహస్తమవును,దీనికిఅధిదేవతఇంద్రుడు.

వి॥ శ్లో॥ కూలజక్షేపనదీపూరే సింహేదైత్యేమృగాననే ।
కల్యాణేనిబిడేమత్స్యేనక్రేచాయం నియుజ్యతే॥

తా॥ గట్టునొరయు, ఏటివెల్లువ, సింహము, అసురుడు, మృగము యొక్క మొగము, బంగారులేక పెండ్లి, నిండినది, మంచె, మొసలి, వీనియందు ఈహస్తమువినియోగించును.

౭౩, వర్ధమానహస్తలక్షణమ్.

శ్లో॥ అధోముఖౌహంసపక్షౌ యస్మిన్నన్యోన్యమున్ముఖౌ । సవర్ధనోభవతివాసుకిస్తస్య దేవతా । అస్యానృసింహేంతద్దీప్తారక్షో వక్షోవిదారణే ॥

తా॥ అధోముఖములయిన హంసపక్షహస్తములనుఊర్ధ్వముఖములుగాబట్టినయెడ వర్ధమానహస్తమవును, దీనికిఅధిదేవతవాసుకి. ఇది నృసింహస్వామి, అతని తేజస్సు, హిరణ్యకశిపునిరొమ్మును చీల్చుట వీనియందు చెల్లును.

౭౪, ఉద్వృత్తహస్తలక్షణమ్.

శ్లో॥ అధరోత్తరయోరేకసమయెహంసపక్షయోః ।
ఉద్వృత్తఇతివిఖ్యాతో వాసిష్ఠస్యాధిదేవతా ॥

తా॥ ఒకసమయమందు క్రిందుమీదులుగ హంసపక్షహస్తములు పట్టబడినయెడ ఉద్వృత్తహస్తమవును. దీనికిఅధిదేవత వాసిష్ఠమహాఋషి,

వి॥ శ్లో॥ లజ్జాయాముపమార్థేచ సంతాపేకంటకాదిషు।
ఖేదేభయేవిచారేచ ఉద్వృత్తకరఈరితః॥

తా॥ సిగ్గు, పారవశ్యము, సంతాపము, ముల్లుమొదలయినది, ఖేదము, భయము, చింత, వీనియందు ఈ హస్తమువినియోగించును.

౭౫, విప్రకీర్ణహస్తలక్షణమ్.

శ్లో॥ స్వస్తికహస్తస్య విశ్లేషాత్ విప్రకీర్ణస్స ఉచ్యతే । దక్షిణామూర్తిరేతస్య అధిదేవఃప్రకీర్తితః । చేలాఞ్చలస్యవిస్రంసే స యుజ్యేతవిధూననే ॥

తా॥ ముందుచెప్పినస్వస్తికహస్తమును విడిగాఎత్తిపట్టినయెడవిప్రకీర్ణహస్తమవును. దీనికిఅధిదేవత దక్షిణామూర్తి. ఇదికొంగుతొలగించుటయందును, వదలించుటయందును చెల్లును.

### ౨౬. అరాళకటకాముఖహస్తలక్షణమ్.

శ్లో॥ అరాళకటకా స్యాత్తామరాళకటకాముఖః।
ప్రాప్తయః స్వస్తికత్వంఅనయోర్వామనోఽధిపః॥

తా॥ అరాళహస్తకటకాముఖహస్తములనుస్వస్తికాకారముగఁబట్టిన యెడఅరాళకటకాముఖహస్తమువును.దీనికిఅధిదేవతవామనుడు.

శ్లో॥ తామ్బూలదళఖణ్డానాం దానే చింతావిషాదయోః।
వినియోజ్యఇతిప్రోక్తఃఅరాళకటకాముఖః॥

తా॥ ఆకుమడుపులువక్కపలుకులునిచ్చుట, చింత, విషాదముపీనియందుఈహస్తముచెల్లును,

### ౨౭. సూచ్యాస్యహస్తలక్షణమ్.

శ్లో॥ సూచీముఖౌపురోదేశాద్యుగపత్పార్శ్వగామినౌ।
సూచ్యాస్యఇతివిజ్ఞేయఃఅనయోర్నారదోఽధిపః॥

తా॥సూచీహస్తములనుఎదుటనుండిపార్శ్వములకుఒకటిగాఁజేరబట్టిన యెడసూచ్యాస్యహస్తముగును.దీనికిఅధిదేవతనారదుడు.

వి॥ శ్లో॥ కింకరోమీతివచనే విరహే సకలార్థకే।
విలోకయేతి వాక్యే చ తయోరభినయంవిదుః॥

తా॥ ఏమిచేయుదుననుట, విరహము, సమస్తముననుట, చూడుముననుట, పీనియందుఈహస్తముచెల్లును.

### ౨౮. అర్ధరేచితహస్తలక్షణమ్.

శ్లో॥ ఏకంత్వధోముఖంధృత్వాతౌహస్తావథరేచితౌ।
అర్ధరేచితనామాస్యనందికేశోఽధిదేవతా॥

తా॥ రేచితహస్తమందలియొకహంసపక్షహస్తమునుఅధోముఖము గబట్టినయెడఅర్ధరేచితహస్తమవును. దీనికిఅధిదేవతనందికేశుడు.

వి॥శ్లో॥ ఆవాహేచోపదాదీనాంకార్యగుప్తౌవిమార్గతే॥

తా॥ ఆవాహనముకానుకమొదలగునది, కార్యమునుమరుగుచేయుట పీనియందుఈహస్తముచెల్లును.

### ౨౯. కేశబన్ధహస్తలక్షణమ్.

శ్లో॥ పతాకౌస్యాత్కేశబంధౌతయోర్దుర్గాఽధిదేవతా।
రత్నస్తమ్భేకేశబంధేకపోలాదిషుయుజ్యతే॥

తా॥ రెండుపతాకహస్తములుకేశబంధహస్తమవును. దీనికిఅధిదేవత

దుగ్గా. ఇదిరత్నస్తంభము, కోష్ఠ, చెక్కిళ్లు మొదలయినవానియందువిని యోగించును.

## ౩౦. ముష్టిస్వస్తికహస్తలక్షణమ్.

శ్లో॥ ముష్టిహస్తౌస్వస్తికతాంకుక్షిస్థానేగతౌయది।
ముష్టిస్వస్తికతాంస్యాత్తాం దేవఃకింపురుషఃస్మృతః॥

తా॥ కడుపుమీఁదుగాముష్టిహస్తములనుస్వస్తికములుగబట్టినయెడ ముష్టిస్వస్తికహస్తమగును. దీనికిఅధిదేవతకింపురుషుఁడు.

వి॥ శ్లో॥ క్రీడాకందుకసంధానేద్వంద్వయుద్ధనిరూపణే।
వ్రీడాభరేస్వవిబంధేవినియోగస్తయోర్భవేత్॥

తా॥ చెండాడుట, ద్వంద్వయుద్ధము, మిక్కుటపుసిగ్గు, పోకముడి, వీని యందుఈహస్తమువినియోగించును.

## ౩౧. నళినీపద్మకోశహస్తలక్షణమ్.

శ్లో॥ వ్యావర్తితౌపద్మకోశౌయదిస్వస్తికతాంగతౌ।
నళినీపద్మకోశాఖ్యస్స్యాత్తాం శేషోధిదేవతా॥

తా॥ పద్మకోశహస్తములను వెనుకకుత్రిప్పిస్వస్తికములుగబట్టినయెడ నళినీపద్మకోశహస్తమగును. దీనికి అధిదేవతఆదిశేషుఁడు.

వి॥ శ్లో॥ నాగబంధేచముకుళేసమయోందానకర్మణి।
స్తబకేదశసంఖ్యాయాంగణ్డభేరుణ్డకేమతౌ॥

తా॥ నాగబంధము, మొగ్గ, సమముగనిచ్చుట, పూవుగుత్తి, పదియను ట, గండభేరుండపక్షి, వీనియందుఈహస్తమువినియోగించును.

## ౩౨. ఉద్వేష్టితాలపద్మహస్తలక్షణమ్.

శ్లో॥ ఉద్వేష్టితక్రియావంతౌవక్షస్థస్యాగ్రేలపల్లవౌ।
ప్రవృత్తావలపద్మాఖ్యౌభవేతాంశక్తిదేవతా॥

తా॥ అలపల్లవహస్తములనుచుట్టుకొబడినవిఅగునట్లురొమ్మునకెదురు గాబట్టినయెడఉద్వేష్టితాలపద్మహస్తమగును. దీనికిఅధిదేవతశక్తి.

వి॥ శ్లో॥ ప్రాణేశేదీనవచనేస్తనయోర్వికచాంబుజే।
మోహితాస్మీతివాక్యేచప్రలాపస్యనిరూపణే।
కామితార్థప్రకరణేపతేషువినియుజ్యతే॥

తా॥ ప్రాణనాథుఁడు, దీనవచనము, స్తనములు, వికసించినకమలము, మోహితురాలనైతిననుట, ప్రలాపమునునిరూపించుట, కోరికనుతెలియజే యుటమొదలైనవానియందుఈహస్తమువినియోగించును.

